# శివ సాక్షాత్కారం



సమైక్యతా రచయిత

బి. యం. డి. ఖ్వాజా

ప్రథమ ముద్రణ : 1997

ముద్రణ : క్రిసెంట్ ప్రింటింగ్ ప్రెస్, ఉరవకొండ.

వెల రు. 6-00



కృతజ్ఞతలు ; శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానం
తిరుపతివారి ఆర్థిక సౌజన్యంతో ముద్రింపబడినది.

ప్రతులకు :

**B. Md. KHAJA**

Writer, D. No. 4-2-87
URAVAKONDA – 515 812.
Anantapur Dist.

# అంకితం





సహృదయులు, సాహితీ పిపాసి
పీడిత ప్రజల మనోజ్ఞమూర్తి
శ్రీ పయ్యావుల కేశవ్ MLA గారికి
వీరి సతీమణి పయ్యావుల హేమలత
గార్లకు

ఈ పుస్తకం అంకితం.

మీ

బి. యం. డి- ఖాజా

# కృతజ్ఞతలు

ఈ గ్రంథాన్ని రాయటానికి నాకు ప్రేరణ ఇచ్చిన మిత్రుడు సాహిత్యాభిమాని శ్రీ మాలపాటి శ్రీనివాసులు గారికి నా రచనల్ని చదివి నన్ను ఆశీర్వదించే నా గురుతుల్యులు పద్మభూషణ ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారికి, మిత్రులు అష్టావధాని శ్రీ ఆశావాది ప్రకాష్‌రావు గారికి, ఓ కళాకారుడిగా వారికి నా హృదయ పూర్వక అభివందనములు. విషయ సేకరణ కోసం నేవెళ్ళిన ప్రతి శివాలయంలో తమకు తెలిసిన వాస్తవ సంఘటల్ని, శిల్ప కళా విశిష్టతను తెలియచేసి నన్ను నా రచనకు సహకరించిన ఆలయ అర్చకులకు 'గైడ్'లకు,ధర్మకర్తలకు నా కృతజ్ఞతలు, అలాగే ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వాహణాధికారి గారికి, ఎడిటర్ గారికి మరియు సిబ్బందికి నా కృతజ్ఞతలు.

మీ

బి. యం. డి. ఖాజా

రచయిత

ఉరవకొండ

20-12-97

# అమరావతి

ఆలయాలు భారతీయ సంస్కృతికి నిలయాలు. ఆంధ్రప్రదేశ్‌లో అనేక ప్రాచీన ఆలయాలు వున్నాయి. సూర్య భగవానుని కరస్పర్శతో పరామర్శ పొంది, కాంతి కళికలు చిలకరిస్తూ, కళా కౌముది వెండి పూతలలు మెరుగు పలుకులు గులకరిస్తూ, సౌందర్య శిల్పాలతో వెలుగొందే పుణ్య క్షేత్రాల్లో అమరావతి ఒకటి.

అమరావతి అలనాడు ప్రపంచానికే విద్యా కళాతత్త్వ భిక్ష పెట్టిన బౌద్ధ పీఠంగాను, తరువాత శక్తి పీఠంగాను, అటు తరువాత శైవ మత సంబంధమైన పంచారామాలలో ప్రధాన మైనదిగాను ప్రసిద్ధి గాంచింది. అమరావతి అతి ప్రాచీన మైన పుణ్య క్షేత్రం. ఇది గుంటూరుకు వుత్తరంగా కృష్ణానదీ తీరంలో శిథిల సమూహం. శాతవాహనుల కాలం నుంచి అమరావతి చరిత్ర ప్రశిద్ధి కెక్కింది. ఆంధ్రుల గర్వ కారణంగా రాజధాని అయి విలసిల్లింది. కృష్ణా నది నిండుగా, గంభీరంగా ఒడ్డులు తాకుతూ ప్రవహిస్తున్నప్పుడు నౌకా విహారము హృదయములో వుల్లాసము మనస్సులో భక్తి రెండింటిని కలిగిస్తుంది. ఆ ప్రాంతంలో కృష్ణావేణి కోపతాపాలకు అవకాశం లేదు. పడవమీద పడి ఏటిలోకి పోయి, క్షేత్ర ప్రాకారాల వైపు చూస్తె కలిగే ఆనందమూ, మంజుల మానసంలో తృప్తి కరంగా వుంటుంది. పడవ షికారు తరువాత స్నానం చేసి తడి బట్టలతో దైవ దర్శనం చేసుకొని ప్రతి ప్రాకారంలోనూ వున్న ఇతర దేవతల సందర్శనం ముగించు కుంటారు కొందరు యాత్రికులు. బౌద్ధ స్తూపాలు అమరేశ్వర దేవాలయానికి కొంచెం దూరంగా వుంటాయి. వాటిని దర్శించటం వుత్సాహంగా వుంటుంది. స్తూప నిర్మాణంలో వున్న శిల్ప కళా జగత్తుకు భిక్ష పెట్టిన స్థితి స్పష్టంగా కనబడుతూ వుంటుంది. ఆ శిల్పాల పుట్టు పూర్వోత్తారాలు వెలుగులోకి ఎలా వచ్చిందీ తెలుసుకోవాలని కోరిక కలుగుతుంది.

రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు అమరావతిని రాజధాని చేసుకొన్న తరువాత అక్కడి ప్రజలకు ఇళ్ళు నిర్మించుకోడానికి రాళ్ళు కావల్సి వచ్చినందుకు, పురాతనమైన అక్కడి దిబ్బలు త్రవ్వించడంతో "దీపాల దిన్నె" వెలుతురులోకి వచ్చింది. దీనిలో బౌద్ధ స్తూపం శతాబ్దాల తరబడి మరుగుపడి వుంది. త్రవ్విన వాళ్ళకు దాని విలువ తెలియక పోవడంతో చాలా భాగం దుర్వినియోగం అయ్యింది. 1797 సంవత్సరంలో మెకంజీ ఆ శిల్పాలు చూచి, విలువలు గుర్తించి, పత్రికలలో వ్యాసాలు వ్రాసి ప్రాచుర్యం ప్రసాదించారు. అప్పటి నుంచి వాటి అభివృద్ధి ప్రారంభ

చేరాయి. మరి కొన్ని మచిలీపట్నం వెళ్ళాయి. మద్రాసు పోయిన శిల్పాలలో కొన్ని ఇంగ్లాండు ఆ పైన అమెరికా ప్రయాణం చేశాయి. ఆ శిల్పాల తీరును చూచి ఫెర్గుసన్ అనే ప్రఖ్యాత చరిత్రకారుడు, విమర్శ వ్రాసి ప్రచురించిన గ్రంథంతో అమరావతి శిల్ప కళకు ప్రపంచ ఖ్యాతి లభ్యమయింది. బౌద్ధాంధ్ర శిల్ప చక్రవర్తుల మత దృష్టి వల్లనేకాక కళా సృష్టివల్ల మాత్రమే వాళ్ళు శిల్పాలకు విశ్వ విఖ్యాతి కల్గింది.

అశోకుడు మగధ దేశంలోనే స్థానికంగా వర్ధిల్లుతుండిన బౌద్ధ మతాన్ని విశ్వ వ్యాప్తం చేయడానికి దేశ దేశాలకు భిక్షువులను ప్రచారకులుగా పంపినారు. అట్టి వారిలో ఆంధ్ర రాష్ట్రానికొచ్చిన బౌద్ధ మత ప్రచారకుడు మహాదేవ భిక్షువు. మహాదేవ భిక్షువు మగధకు ముఖ్య పట్టణం అయిన పాటలీపుత్రములోని మహా సాంఘికులకు నాయకుడు. ఈతడు మన ధాన్యకటకాన్ని నివాసంగా చేసుకొని శాతవాహన రాజుల ఆదరాభిమానాలను చూరగొని బౌద్ధ మతంలో చైత్యక వాదం అనే ఒక సాంప్రదాయాన్ని స్థాపించాడు.

అమరావతి ప్రాచీన శోభను స్మరింపజేసే ముఖ్య చిహ్నం. అక్కడి అమరావతి స్థూపం. ఈ స్తూపపు కట్టడములను చూచినట్లు అయితే ఇది ఒకేసారి నిర్మించబడలేదని తేట తెల్లమౌతుంది. ఇందలి ప్రాచీన నిర్మాణరీతులనుబట్టి యీ స్థూపం రెండు మూడు వందల సంవత్సరాల నాటిదని చెపుతారు. గౌతమ బుద్ధుడు నిర్యాణం చెందిన తరువాత ఆతని శరీర అవశేషాలను బట్టి ఎనిమిది ప్రధాన స్తూపములను అశోకుడు ఆయా ప్రాంతాలలో కట్టించెనని. దానిలో ఒకటి అమరావతి స్తూపం కావచ్చునని అంటున్నారు. అశోకుడు బౌద్ధ మతాన్ని విస్తరింపజేయవలచి అందలి ఎముకలను కొన్ని వేల ముక్కలుగా చేసి ఆయా తావుల్లో బౌద్ధ స్థూపాలను నిర్మింపజేసినాడట. అట్టి శారీరక ధాతువులు వున్నవే అమరావతీ, నాగార్జున కొండలలోని స్థూపాలని కొందరు అభిప్రాయ పడుతున్నారు. ఏది ఎట్లయినా ఆంధ్ర వంశీయులైన శాతవాహనుల బౌద్ధ మతమును ఆదరించి, అమరావతీ శిల్పాలను బహురీతుల పెంపొందించారు. దయామయులైన బౌద్ధ మత ప్రచారకులు తమ బౌద్ధ విహారాలను, స్థూపాలను నదీ తీర ప్రదేశాలకు చేర్పించినారు.

ఆంధ్ర రాష్ట్రంలోని బౌద్ధ క్షేత్రాలలో అమరావతి మకుటం వంటిది. ఇది బౌద్ధ మతానికి, ఆంధ్ర సంస్కృతికి వుత్తమైన శిల్ప కళకు నివాసమేకాదు. సుప్రసిద్ధ విశ్వ విద్యాలయమై ఖ్యాతి గాంచింది. హిందూ యుగంలో బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులకును. అందులో బ్రాహ్మణులకే చదివే అధికారంగల వేదం. వాఙ్మయం విద్యలు బౌద్ధ యుగంలో మానవ మాత్రులైన అందరుకూడా విద్యను అభ్యసించారు. వర్ణ భేదాలు బౌద్ధ మతంలో లేవు. ఎవడు విజ్ఞానవంతుడో వాడే బౌద్ధ మతంలో పూజ నీయుడు. ఇదే విధంగానే విశ్వజననీయ భావంతో ఆనాటి సంఘానికి బుద్ధుడు పూజ నీయుడైనాడు.

ఇప్పుడు అమరావతిలో చిన్న స్తూపం వుత్తమ కళా భాగాలు పోగా మిగిలిన స్వరూపాన్ని మెకంజీ పునర్నిర్మించాడు. స్తూపం పాలరాతి కట్టడం. ప్రాచీనతా శిల్ప ప్రాముఖ్యత తెలియని వెంకటాద్రినాయుడు పని మనుష్యులు పాల రాళ్ళను పగలగొట్టి వాటిని కాల్చి సున్నంచేసుకొన్నారని అక్కడ వదంతి వున్నది. స్తూపం మీద వున్న బొమ్మల్ని ఆధారంగా చేసుకొని ఆ నా టి ఆంధ్రుల వస్త్రాలు, ఆభరణాలు, అలంకారాలు తెలుసుకొన వచ్చును.

స్థూలంగా స్తూపం రూపం ఇలా చెప్పకోవచ్చును. ఒక పెద్ద వృత్తంలాగా సుంద్రంగా గోడ వుంటుంది, దానికి నాలుగు ప్రక్కల సింహ ద్వారాలు వుంటాయి. వాని లోపల ఎత్తుగా బోర్లించిన అర్ధ గోళం ఆకారంలో "అండము" దాని అంచుల మీద చుట్టూ వేదిక నిర్మించబడి వుంటాయి. వేదికను ఆనుకొని సింహ ద్వారాలకు ఎదురుగా నాలుగు "ఆయక్ వేదికలు" ఒక్కొక్క దానిపైన ఐదు అయక స్తంభాలు వుంటాయి. ఆయక స్తంభాలు ఆంధ్ర బౌద్ధ మత స్తూప విశిష్టతలు చాటుతాయి. వృత్తానికే, అండానికీ మధ్య ప్రదక్షిణ పథం వుంటుంది, అర్ధ గోళంపైన 'హర్మిక" ఆపైన ఛత్రం వుంటాయి.

ప్రతి పాలరాతి మీద బుద్ధుని జీవితానికి సంబంధించినదీ, పూర్వ జన్మకు సంబంధించినదీ కొన్ని ఘట్టాలు చిత్రింప బడ్డాయి. హీనయానము, మహాయానము రెంటికి ఆధిక్యం వుంది. ఈ శిల్ప కళ దాదాపు క్రీస్తు పూర్వము రెండు వందలనాటి దని విజ్ఞాన శాస్త్రవేత్తలు ఊహిస్తున్నారు. సౌకుమార్యమూ, సౌందర్యమూ ఈ శిల్పాల

ఈ స్తూపాలపైన శిల్ప రచనలో స్త్రీ చిత్రాలు వినూత్న రూపాలు సంతరించుకొన్నాయి. ఒక స్త్రీ శిల్పంతో పోలిక కలిగి. మరొకటి లేనే లేదు. స్త్రీ పురుషుల చిత్రాల్లో జీవకళ వుట్టిపడుతూంది. ఆ కాలంలో భారతీయ శిల్ప కళకు అమరావతి కళ శిరోభూషణమని. అంతేకాక ప్రపంచానికే ఏకగా శిల్పంలో అమరావతి అని విశిష్ట సంప్రదాయం ఒకటి ఏర్పడింపనీ విజ్ఞానులు అంటున్నారు. శాతవాహనుల రాజధాని ధాన్యకటకం. అది ప్రస్తుతం ధరణికోట. ఇది అమరావతికి రెండు కిలోమీటర్ల దూరంలో వుంది. అప్పటి అమరావతి ఐశ్వర్యంలోనూ, శౌర్య ప్రతాపంలోనూ బౌద్ధుల శిల్ప కళ అన్ని దేశాలకు అర్థమైయింది.

శాతవాహనులు బౌద్ధ మత ప్రచారం చేసినా హైందవ ధర్మానికి అటపట్టైన అమరావతి క్షేత్రం చెక్కు చెదరకుండా వుండటంతో వారి పరమత సహనం ప్రత్యక్షంగా కనబడుతూంది. ఆ కాలంలో అమరావతిలో ఒక విశ్వ విద్యాలయం వుండేది. ధాన్యకటక విశ్వ విద్యాలయం ( శ్రీ పర్వత విద్యా పీఠం ) అని దానికి పేరు. చతుష్షష్టి కళలు అక్కడ నేర్చుకోవడానికి వివిధ దేశాల నుండి విద్యార్థులు వస్తూ వుండేవాళ్ళు. లలిత కళలు ప్రాముఖ్యత పొందాయి. అందులోనూ శిల్ప కళకు అధిక ప్రాధాన్యత వుండేది. బౌద్ధ మత ప్రచారానికి అనుగుణంగా శిల్ప కళ అభివృద్ధి పొందింది. ఆ కళా నైపుణ్యం చరిత్రకు అతీతంగా ప్రతిబింబించింది.

నాగార్జునుని ఆచార్యత్వంతో విశ్వ విద్యాలయం నడుపబడిన సమయంలో తయారు అయిన శిల్ప కళా ఖండికలు ప్రపంచ కీర్తి అర్జించు కున్నాయి. పురాతత్వ శాస్త్రజ్ఞులు నాగార్జున సాగర్ త్రవ్వకాల్లో వెలుగులోకి తెచ్చిన శిల్పాలు ఆనాటి శిల్పజ్ఞతను చాటుతున్నాయి.

శాతవాహనుల రాజ్య పాలన కాలంలో బౌద్ధ మతం వున్నత శిఖరాల అధిరోహించడంతో హైందవ ధర్మానికి ప్రతీకగా నిలిచిన అమరావతి క్షేత్ర ప్రశస్తి. ప్రజల ఆదరరాభిమానాలు అడుగంటి క్షీణించి పోయాయి.

కాలక్రమేణ శాతవాహనుల పాలన అంతరించింది. బౌద్ధ మతం తగ్గిపోయింది. ధాన్యకటకం రాజధాని కాకుండా పోయింది. అమరావతి నిర్మానుష్యమైంది. కొన్నిగా జరుగుతున్న పూజలు అక్కడ పూర్తిగా నిలిచి పోయాయి, బౌద్ధ మత భిక్షువులు దాసంగ్ (టిబెట్) విద్యా పీఠంలో వేలాది బౌద్ధ భిక్షువులు వుండేవారు, ఆరు కళాశాలలు గల విశ్వ విద్యాలయం వుండేది. ఇలాంటి వివరాలన్ని అమరావతిని గురించి తెలుసు కోవడానికి దురదృష్టవశాత్తు మన బౌద్ధ సంస్కృతి నాశనమైయింది. బౌద్ధ యుగంలో ఉత్తర హిందూస్థానంలో తక్షశిల, నలంద, ఉజ్జయిని మున్నగు విద్యా పీఠాలు సుప్రసిద్ధాలైతే, దక్షిణ భారత దేశంలో ధాన్యకటకము, వేగి, కాంచీపురము, శ్రీశైలము సుప్రసిద్ధ విద్యా పీఠాలై ప్రకాశించాయి.

బౌద్ధ కాలపు శిల్పాచార్యుల సిద్ధ హస్తాలతో రూపొందిన కళా సామాగ్రిలో స్తూప నిర్మాణం ఒకటి. ఈ స్తూప నిర్మాణంలో అమరావతి స్తూప శిల్ప సౌందర్యం పలు దేశాలు కొనియాడాయి. క్రమ క్రమంగా బుద్ధుని జీవిత గాథలు, చరిత్రలు శిల్పంగా రూపొందిస్తే బుద్ధ దేవుని పూర్వ జన్మము అందలి గాథలు, జాతక కథలు కూడ శిలలపై చిత్రించడానికి బౌద్ధులు పూనుకొన్నారు. అమరావతి ప్రాకారపు గోడ ఆ స్తూపపు అండాకృతిలో చిత్రించిన లతలు, ఎనలేని విగ్రహాలు, అధిష్టాన చిత్రాలు ఊర్ధ్వపట చిత్రాలను చూస్తూంటే ఆనాటి దైవ శిల్పం అంటే అతిశయోక్తి కాదేమో! చైత్య శిలా ఫలకాలమీద కొలువుదీరి వున్న బుద్ధమూర్తి, ఆయనను పరివేష్టించిన ఆ పరివారము యథార్థంగా ఆ కాలపు బుద్ధుని ధర్మ సభను జ్ఞప్తికి తెస్తుంది. ఒక పంక్తిని తీర్చి దిద్దడానికే మన ఆంధ్ర శిల్పి తన జీవితాన్నే ధారపోసి వుండవచ్చునని తెలుస్తుంది. ఇది అంతయు సౌందర్యపు పోత చినికి జీర్ణించిన ఈ శిలా ఖండాలు శిల్ప వైభవాన్ని చాటుతున్నాయి.

శాతవాహనుల రాజ్య మంతరించి పల్లవులు, విష్ణుకుండినులు, చాళుక్యులు వాకాటకులు మొదలగు వంశములవారు పౌరాణిక మతాన్ని ప్రేమించి ప్రచారం చేశారు. మళ్ళీ వర్ణ వ్యవస్థ, అర్థరహితమైన తరతమ భావం ప్రజల్లో రేకెత్తి బౌద్ధ యుగం నాటి ఆ విజ్ఞాన వైభవం కళా సంపత్తి, వీర విక్రమం, ఆ సంస్కృతి అన్నీ సన్నగిల్లి పోయాయి. ఏడవ శతాబ్దంలో హూయన్‌త్సాంగ్ అనే చైనా యాత్రికుడు వచ్చినప్పటికే ధాన్యకటకం క్షీణ దశలో వున్నట్లు తెలుస్తుంది.

స్వామివారిని దర్శించి, నిత్య నైవేద్య దీపారాధన ఏర్పాటు చేశారు. అప్పటికే అమరావతి హైందవులకు పుణ్య క్షేత్రమై ఉత్తమ స్థాయి అందుకున్నది. ఆంధ్ర దేశములో పుణ్యతీర్థమై భారతావని అంతటిని ఆకర్షించే స్థితిని అందుకొంది, విజయనగర సామ్రాజ్యం పాలించిన కవిరాజు అయిన శ్రీ కృష్ణ దేవరాయలు అమరావతిని దర్శించి పూజించటంతో క్షేత్ర మహాత్యం మరో బంగారు రంగు శృంగారించుకొంది.

కన్నుల పండువుగా అమరావతి క్షేత్రం కనిపించే ఆకారం కల్పించిన మహానుభావుడు రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు. ఆయన సంస్థానాధిశుడు తన రాజధాని చింతపల్లి నుంచి అమరావతికి మార్చుకొన్న వృత్తాంతం ఒకటి వుంది. ఆ మార్పు వలననే అమరావతి అభివృద్ధి చెందింది.

అమరేశ్వరాలయ క్షేత్రం అంతా పది ఎకరాల విస్తీర్ణంతో వుంటుంది. ప్రాకారాలు సమబాహు చతుర్భుజాలులాగా వుంటాయి. నాల్గు ప్రక్కల నాల్గు ద్వారాలు వున్నాయి. అవి ఒకదాని కొకటి ఎదురుగా తిన్నగా వున్నాయి. క్షేత్ర నిర్మాణములో గొప్పతనం ఏమిటి అంటే వాస్తుశాస్త్ర పరిజ్ఞానంవున్న వ్యక్తుల కళా విశిష్టత కనబడటం, కాలక్రమంగా కళ్యాణ తిలకం దిద్దుకుంటూ దిన దినమూ ప్రవర్ధమానమౌతున్న వందలాది యాత్రికులతో విలసిల్లుతూ వచ్చిన అమరావతి కృష్ణానది దక్షిణ భాగంలో ఒడ్డునే, గుంటూరు జిల్లా సత్తెనపల్లి నియోజక వర్గంలో ఒక చిన్న గ్రామంగా నేడు కొనసాగుతూంది. అమరేశ్వర దేవాలయం పంచ ప్రాకారాల పరివేష్టితం అంటారు. కాని మూడు ప్రాకారాలే అక్కడ స్పష్టంగా కనబడుతూ వుంటాయి. ఆ ప్రాకారాలలో అనేక దేవ దేవతాగణం పూజ లందుకుంటూ వుంటుంది, ఇందులో ముఖ్యంగా స్తూపారాధన ఛత్రము, మాలవాహకుల జాతక కథ, ప్రాకార శిష్టాపీశమ్. స్త్రీ విగ్రహం, పూర్ణాకుంభం మొదలైన శిల్పాలు అక్కడ గోచరిస్తాయి.

గాలి గోపురం చుట్టూ పది ఆమడాల దూరం కనిపిస్తోంది అంటారు. ఇది చాలా ఎక్కువగా వుంటుంది. అది మొదటి ప్రాకారంలో వుంది. మొదటి ప్రాకారంలో ప్రణవేశ్వరుడు, శంకరాచార్యుడు, కాశీ విశ్వేశ్వరుడు, అన్నపూర్ణాదేవి, ఉమా మహేశ్వరుడు, దత్తాత్రేయుడు, జ్వాలాముఖీ అమ్మవారు, అగస్త్యేశ్వరుడు, పార్థివేశ్వరుడు, సోమేశ్వరుడు, నాగేంద్రుడు, మహిషాసురమర్దని అమ్మవారు, కోటేశ్వరుడు, వీరభద్రుడు వున్నారు. ప్రతి దేవునికి పూజలు చేస్తూ,

ముందుకు నడుస్తూవుంటే మొదటి ప్రాకారం పూర్తవుతుంది. పచ్చని గరిక మీద తెల్లని మంచు తుంపరులు వెండితుంపురులులాగా మెరుస్తూ వుంటాయి. అక్కడ నడుస్తూవుంటే శరీరం పులకరిస్తూ వుంటుంది. చల్ల గాలి వీచి కల్లోదోబూచుతూ తిరిగి తిరిగి ఆ ప్రదేశపు శిల్ప కళా వైభవాన్ని చూచి పులకరించి పోతారు.

రెండవ ప్రాకారంలో విఘ్నేశ్వరుడు కాలభైరవుడు, కుమారస్వామి, హనుమంతుడు, గణపతి కాక జిమ్మి వృక్షంలోకూడ అక్కడ చూడవచ్చును. ఈ ప్రాకారం మొదటి దానికంటే చిన్నది, ప్రతి దేవుని ఎదుట ప్రార్థన చేసే పద్ధతి అందుకు అవసరమైన శ్లోకాలు వున్నాయి. భగవంతుని గురించి ఆలోచించే మనస్సుకంటే అక్కడ కలిగే తన్మయభావం హృదయంలో శాశ్వతంగా ఉండిపోతుంది. పరమాత్ముని సన్నిధిలో ఆత్మ పొందే అనుభూతి పరంపరలు ఆ ప్రాంతంలో కలుగుతూ వుంటాయి.

మూడో ప్రాకారంలోని ఆవరణం మొదటి రెండు ప్రాకారాలకంటే చిన్నది. అయితే ఎత్తుగా వుంటుంది. చల్లని నీడలు ప్రసాదించే చెట్లు ఆహ్లాదం కలిగించే కృష్ణవేణి తరంగాలు, ప్రాకారాలలో పచ్చని గరిక అన్నిటికంటే దైవ దర్శనంతో హృదయంలో కలిగే భక్తి భావం అనుభవ విభాగాలతో అభివృద్ధి పరస్థితి సమీపిస్తూ అమరేశ్వర దర్శనంతో పరాకాష్ట అందుకొంటుంది. అమరులు నివసించిన ప్రదేశం కావటంవల్ల ఆ ఊరికి అమరావతి అని వాడుక కలిగింది. అమరులు స్వర్గంలోని అమరావతిని విడిచి పెట్టి ఆంధ్ర ప్రదేశ్‌లోని అమరావతిలో ఎందుకు నివసించారు అంటే అందుకొక పూర్వగాధ వుంది.

పూర్వ తారకుడికీ, ఇంద్రుడికి చాలా సంవత్సరాలు యుద్ధం జరిగింది. అందులో దేవసేనలే ఓడి పోయాయి. దేవతలు భయపడి పారిపోయి శ్రీ మహా విష్ణువును శరణం జొచ్చారు శివభక్తుడైన తారకుని చంపలేనని శంకరుని ప్రార్థించుట కర్తవ్యమని శ్రీ మహా విష్ణువు తెలియజేశాడు. అప్పుడు దేవతలందరూ ఈశ్వరుని దగ్గరకు వెళ్ళి ఆయనకు పూజ చేశారు. ఈశ్వరుడు తన భక్తున్ని తాను చంపలేనని దృష్టత్వం కలిగి వున్నాడు. కాబట్టి చనిపోవాలనీ అందుకు తన అంశంలో జన్మించిన కుమారస్వామిని సేనాధిపతిగా చేసి తారకునితో యుద్ధం చేయమని తెలియజేశాడు. యుద్ధం

జరిగింది. వేలాది రాక్షస సైనికులు మరణించారు. కుమారస్వామి బాణా ప్రయోగంవల్ల ఎంతసేపటికి తారకాసుడు చనిపోక పోవడం గమనించి కుమారస్వామి శక్తిని ప్రయోగించాడు. అప్పటికి తారకుడు మూర్ఛపోయి తిరిగి బ్రతికాడేకాని మరణించలేదు.

దేవతలు కైలాసపతికి ఈ విషయం తెలియజేశారు. తారకుడి కంఠంలో శివలింగం వుందనీ అందులో అతని ప్రాణాలు వున్నాయనీ అది భిన్నం చేస్తే అతను చని పోతాడని భిన్నమయి పడిపోయిన శివలింగ శకటాలు పెరుగుతూ వుంటాయనీ. వాటిని ప్రతిష్టించి దేవతలు పూజించాలనీ అప్పుడు మాత్రమే పెరగడం ఆగిపోతుందనీ, శివుడు చెప్పాడు. మహేశ్వరుడు వాక్ పరిపాలనచేసిన కుమారస్వామి తారకుని కంఠంలోని శివ లింగాన్ని ఛేదించాడు. అయిదు శకటాలయి భూమి మీద పడ్డాయి. అవి పడిన ప్రదేశాలు ప్రసిద్ధి క్షేత్రాలయ్యాయి. పంచారామాలుగా ప్రసిద్ధి పొందాయి అందులో పెద్దదైన శకటం పడిన తావులో ప్రతిష్ట చేసి పూజలు చేస్తూ దేవతలు నివసించటవల్ల ఆ క్షేత్రానికి అమరావతి అని పేరు కలిగింది.

అమరావతిలోని స్వామివారి నామధేయం అమరేశ్వరుడు. ఆ పేరు వినగానే ఇంద్రుడు గుర్తుకు వస్తాడు. జ్యోతిర్లింగం ప్రతిష్ట చేసింది ఇంద్రుడు. అమరులకు అమరత్వం కలిగించిన ఈశ్వరుడు. ఈశ్వరుడే ప్రతిష్ట పొందటంవల్ల ఆస్వామి వారి పేరు అమరేశ్వరుడుగా రూపొందింది,

మూడు ప్రాకారాలు కలిగిన అమరావతి పుణ్య క్షేత్రాంలో త్రిమూర్తులలో మూడవవాడయిన శివునికి సృష్టి స్థితిలయలలో మూడవదాని అధినేత అయిన శివునికి సంబంధించిన శ్రీ అమరేశ్వర స్ఫటిక లింగల పదమూడు గజాల ఎత్తు కలిగి మూడు అడుగుల కైవారంతో మూడు అంతస్తుల పైనున్న గర్భాలయంలోకి చొచ్చుకొనిపోయి ప్రకాశిస్తూ వుంటుంది, కోటికొక్క దేవుడుగా ముక్కోటి దేవతలకు ప్రతినిధులుగా ముప్పయి మంది దేవతలు అమరావతి పుణ్యక్షేత్రంలోని మూడు ప్రాకారాలలోనూ వున్నారు స్వామి అభిషేకం చేయటానికి భక్తులు మెట్లెక్కి పైకి వెళ్ళుతారు. పది ఇరవై మంది ఒకేసారి అభిషేకం చేయడానికి అవకాశం వుంది. నిత్యం నైవేద్య దీపారాధనతో అమరావతి వెలసిల్లుతూంది.

మానవ జాతి కఠోరతకు, కోపానికి, కర్కశత్వానికి, కసికి బలి అయినది కాకతీయ శిల్ప కళా వైభవం. కసి కన్నులు గప్పితే మానవుడు ఎంత అట్టడుగుకు వెళ్ళగలడో ఓరుగల్లు (వరంగల్లు) శిథిలాలు నిరూపిస్తాయి. విజయాలు విజేతలను ఉదారులను, ధీరోదాత్తులను చేస్తాయి. కాని, మన దేశంలో విజేతలు పలువురు పశుప్రాయులుగా ప్రవర్తించారు. లలిత కళలను నేలకొట్టి కాలరాచారు.

భరత నాట్య శాస్త్రానికి లక్ష్య ప్రాయాలుగా విలిసిల్లిన కాకతీయ కళామూర్తులు నేడు ముక్కుపోయి మొర పగిలి, చెక్కులూడి కనిపిస్తూవుంటే, ఎవడు కంట తడి పెట్టడు, ఎవడు గుండె బాదుకోడు.

నేటికి పునాది గతం, గతమూ, గత సంస్కృతీ ప్రతిఫలిస్తున్నది. ఆనాటి సాహిత్య కళా రూపాల్లో లలిత కళలు అనేవి ఎక్కడో ఒక చోట, ఏదో ఒక కాలంలో హఠాత్తుగా పుట్టుకొచ్చిన అవి ఏవి కావు, అనాది కాలం నుంచి మానవుని మనుగడ, అతని మానసిక చైతన్యం, పరిసరాల ప్రభావం, పరిస్థితుల ప్రాబల్యం మున్నగు పరిధిల్లో క్రమ క్రమాను గతంగా పరిణామం చెందుతూ వచ్చినవే నేటి కళా రూపాలన్ని. ఈ కళల్లో వాటి అభివృద్ధి కార్యక్రమాల్లో ఆయా కాలాల సామాజిక స్థితి గతుల స్వభావ స్వరూపాలు సూచన ప్రాయంగానైనా ప్రతి ఫలించాయి. అందుకే ప్రాచీన కళా సంపదలను నేటికి అమూల్యంగా భావించుకుంటున్నారు. ఆలాంటి చరిత్రక కళా క్షేత్రాల్లో మొన్న మొన్నటిదాకా ఓరుగల్లుగా చరిత్ర ప్రసిద్ధమైన ఈనాటి వరంగల్లు ప్రాంతం ఒకటి.

తెలుగు దేశ చరిత్రల్లో కాకతీయుల కాలమొక ప్రత్యేకాధ్యాయం. కేవలం రాజ్య విస్తరణ కాంక్షతో మాత్రమేగాక తెలుగు జాతి అంతటిని ఏక పాలన క్రింద తేవాలనీ, ప్రజా జీవితం సుఖ సంపదలతో వెల్లివిరియాలనే ఉన్నత లక్ష్యంతో సాగిన కాకతీయుల పాలన కాలంలో ముఖ్యులుగా పేర్కొనదగిన పాలకులు ముగ్గురు. గణపతి దేవుడు, రుద్రమదేవి, ప్రతాప రుద్రుడూనూ. క్రీ. శ. 1020 నుండి 1326 వరకు గల మూడు వందల సంవత్సరాలా ప్రాయపు కాకతీయ యుగంలో సగ భాగం వీరి పాలన క్రిందనే గడిచి, వారి కాలమేగాక మొత్తం కాకతీయ యుగమే తెలుగు గుగు చరిత్ర గతిలో స్వర్ణ కాలంగా కీర్తింపబడింది.

[illegible]
క్షంగావటంతో కళలకు ఆదరణ పెరిగి దానికి మతాభిమానం తోడుకాగా వివిధ ప్రాంతాలలోని కళాకారుల విశేష నైపుణ్యం, నిర్విరామ కృషి ఫలించి శిల్ప రూపంలో సాక్షాత్కరించింది. ఈ అపురూప శిల్పాలు నెలకొన్న ప్రాంతాలలో ముఖ్యమైన వరంగల్ కోటిలోగల సర్వ శిథిలతకు లోనైన స్వయం భూ దేవాలయం పాలంపేట లోని రామప్ప గుడి, హనుమప్ప కొండలోని వేయి స్తంభాల దేవాలయం అన్నికూడ సుందరమైన శిల్ప కళలకు ఆటపట్టు. వాస్తు నిర్మాణ నైపుణ్య దృష్ట్యా కూడ గణనీయమైన మనోహర శిల్పాలు,

సుమారు పది కిలో మీటర్ల వైశాల్యంతో సుదీర్ఘమైన చిన్న కొండ గుట్టల శ్రేణిలాగ కన్పించే మట్టి కోట పేరుకు మాత్రమే యిది మట్టి కోటగా కనిపించే యీ మట్టి కోట, మట్టితో నిర్మించినప్పటికి, రాతితో నిర్మించిన వాటిని తీసిపోని ధృఢమైన నిర్మాణ మిది. ఏడు వందల సంవత్సరాల తరువాత కూడ ఎన్నో వర్షాలలో తడిసి. నాని, కరిగి కూడ ఇప్పటికీ తన సహజౌన్నత్యంతోనే దర్శనమిస్తున్నది. ఈనాడు ఈ స్థితిలో వున్నప్పటికి ఆనాడు యీ మట్టికోటపై పదునైన బల్లెంతో బలమంతా వుపయోగించి పొడిచినా ఒక్క మట్టిపెళ్ళకూడా రాలేది కాదట. ఈ బలమైన నిర్మాణానికి అంతకన్నా ధృఢమైన సమున్నతమైన ద్వారాలు నాలుగు దిక్కులుగానూ నాలుగు వున్నాయి.

కొంచెము ముందుకు వెళితే రాతి కోట ఎదురౌతుంది. ఇది వైశాల్యంలో మట్టికోటకన్నా కొద్దిగా చిన్నది. కాని దానికన్నా ఎన్నో రెట్లు శక్తివంతమైనది. కాకతీయుల దుర్గ నిర్మాణ పద్దతులుకూడా వారి ప్రత్యేకతను చాటేవిగానే వున్నాయి. నగరానికి రక్షణగా రాతి కోట దానికి రక్షణంగా మట్టి కోట. ఈ రాతి కోటకూ, మట్టి కోటకూ కూడ చుట్టూ అగాధమూ, విశాలమూనైనా అగర్తలుండేవి. ఇప్పుడు కేవలం నాటి ఛాయలు మాత్రమే గోచరిస్తాయి.

ఈ కోటల మధ్యనే ఏడు వందల సంవత్సరాల క్రితం వరకూ దాదాపు ఎనిమిది లక్షల జనాభాతో అనేక వాడలతో, మహా భవనాలతో, సుందర దేవాలయాలతో విశాల రాజ మార్గాలతో, చిత్రాలతో, తాటాకులతో, ఉద్యాన వనాలతో, వీటన్నిటికి మధ్యగా మహోన్నత శిఖరంతో సాక్షాత్తు ఆ విశ్వకర్మ దిగివచ్చి స్వయంగా నిర్మిం

క్రీ. శ. 1199 లో ఆనాటికి బలవంతులుగా వున్న చోళ రాజులందరినీ జయించి పరిసర రాజ్యాలపై జైత్ర యాత్రలు చేసి, రాజ్యాన్ని విస్తరింప చేసుకొని తిరిగి వచ్చిన కాకతీయ గణపతి దేవుడు, అంతవరకూ రాజధానిగా వున్న హనుమకొండ తగినదిగా లేదని భావించి ఈ ప్రాంతంలో రాజధాని ఏర్పాటు చేసుకొని ఈ మహా దుర్గ నిర్మాణానికి పునాది వేశాడు. గణపతి దేవుడు కుమార్తె రుద్రమదేవి కాలంలో (1261) పూర్తి అయినది.

రుద్రమదేవి కాలంలో యీ కోట ఈ మహా నగరము సకలాంధ్ర దేశము మహోన్నత స్థితిని అనుభవించాయి. రాతి కోట ద్వారాలకే బంగారు పూత వేయ బడిన తలుపులు వుండేవి. ఈ మహా నగర వైభవానికి కళ్ళుకుట్టి ఆనాడు దేశములోకెల్ల మహా బలవంతులైన ఢిల్లీ సుల్తానులు లక్షలాది సైన్యంతో వరుసగా ఏడు సార్లు దండెత్తి వచ్చికూడ యీ దుర్గాన్ని జయించలేక పోయారు.

ఈ మహా నగర ఛాయలు ఏవి ప్రస్తుతం ఇక్కడ లేవు. ఉన్నదల్లా మట్టి కోటలూ, వీటి మధ్య సర్వనాశనం కావింపబడిన స్వయం భూదేవేశ్వర ఆలయాలు శిథిలాలు మాత్రమే కాని, ఆనాటి దేవాలయ మహోన్నత రూపాన్ని ఊహించుకోడానికి ఆ శిథిల శిల్పాలే చాలు. ఢిల్లీ పాదుషా అలీ ఏడుసార్లు దండయాత్ర చేసి, అందులోని కళా ఖండాల్ని మత ద్వేషంతో సర్వనాశనం చేశారు.

శిథిలం కాకుండా సూచన ప్రాయంగా వున్న స్వయం భూదేశ్వరాలయం ద్వారాలు మాత్రమే. సాంచీ స్తూప ద్వారాలకు జ్ఞప్తికి తెచ్చేవిగా వున్నాయి. దాదాపు అయిదారు నిలువుల ఎత్తుతో, క్రింద నుండి పైదాకా నెలకొన్న వివిధాలంకార శ్రేణులతో ఇటు శిల్ప నైపుణ్యంతోపాటు అటు నిర్మాణ చమత్కృతికి కూడా ఇవి విస్మయం చేసే మహా ద్వారాలు, నాల్గు దిక్కులకూ అభి ముఖంగా వున్న ఈ నాలుగు ద్వారాల మధ్య స్వయం భూదేశ్వరాలయం వుండేది. ద్వార పాలక, పాలికా విగ్రహాలూ దేవాలయ కుడ్యాలపై, స్తంభాలపై చెక్కబడిన నర్తక నర్తకీ, వాద్యకారుల

మకర తోరణాలూగల ఎన్నో శిథిల శకాలు యిక్కడ పడి వున్నాయి.

కాగా హనుమకొండలోని వేయిస్తంభాల దేవాలయ నిర్మాణ వైఖరినిబట్టి అక్కడగల అలంకరణ శిల్పాలకూ వీటికి గల పోలికలను బట్టి ఈ స్వయం భూదేవేశ్వర స్వరూపాన్ని ఊహించుకొనవచ్చును.

వేయి స్తంభాల దేవాలయం ఆరు అడుగుల బలమైన పునాదిపై నిర్మితమైనది. రెండు భాగాలుగావున్న ఈ దేవాలయంలో ఒక వైపు ఆరు వందల స్తంభాలు వున్నాయి. మరోవైపు నాలుగు వందల స్తంభాలు వున్నాయి. ఈ నిర్మాణంలో సగం భాగం శిథిలమైనా ప్రధాన భాగం మాత్రం చెక్కు చెదరకుండా నిలిచి వున్నది. దీనిలోని సగ భాగాన్ని కాకతీయ రుద్రదేవుడు, మిగితా భాగాన్ని గణపతి దేవుడూ నిర్మించారని, క్రీ. శ. 1162 లో దీని నిర్మాణం పూర్తి అయిందని అక్కడి చరిత్రను బట్టి తెలుస్తుంది.

ఇక్కడ వేల స్తంభాలు, ద్వారాలు, గోడలు, పైకప్పు సర్వమూ. నల్లని కురివెంద శిలలతోనే రూపు దిద్దుకున్నాయి. ఈ ద్వారాలపై స్తంభాలపై వాటి శిల్పుల అసమాన నైపుణ్యం ప్రదర్శించిన మనోహర శిల్పాలు అసంఖ్యాకంగా రూపొందినాయి. చూపరులను ఆశ్చర్య చకితులను చేసే అత్యంత విశితమూ, లలితమూనైనా అలంకార శిల్పంతో పూజింపబడిన సుప్రసిద్ధమైన నంది విగ్రహం ఇక్కడే వున్నది. ఈ నంది విగ్రహపు గంభీర స్వరూపము దాని మెడలో అలంకారంగా చెక్కబడిన గంటలూ. వాటిని బిగించిన తాళ్లు మూపురంవద్ద ఆ తాళ్ళ అన్నింటిని కలిపి ముడి వేసిన తీరూ వీటన్నిటి కల్పనలో, ఆ కల్పనకు ఆకారం ఇవ్వడంలో శిల్పులు ప్రదర్శించిన ప్రజ్ఞ సామర్థ్యమూ ఆశ్చర్య చకితులుగా చేసేవిగా వున్నాయి.

ఈ కోవకు చెందినదే ఇక్కడికి 60 కిలోమీటర్ల దూరంలో వున్న రామప్పగుడి కూడ బాహ్య రూపంలో స్వల్పమైన తేడాలున్నా ఈ రామప్పగుడి వేయ్యిస్తంబాల దేవాలయం స్వయం భూదేవేశ్వరాలయం కూడా ఒకే రకమైన నిర్మాణాలే

మూడు కూడ శివాలయాలే. ఒక వైపు బ్రహ్మాండమైన తటాకం మరోవైపు కొండలు గుట్టలతో కూడుకున్న అరణ్యం మిగిలిన రెండు వైపుల వాగులూ పిల్లకాలువలూ, తోపులు పచ్చని పొలాలతో కూడుకున్న ప్రశాంత వాతావరణం మధ్య ఈ దేవాలయం హనుమకొండ, వరంగల్ దేవాలయాలలో లేని అదనపు శిల్పాల దివ్య శోభతో వాటిని మించిన నిర్మాణ నైపుణ్యంతో దర్శనమిస్తుంది.

ఈ మూడుచోట్ల కూడ దాదాపు ఒకే రకమైన నిర్మాణ పద్ధతీ, శిల్ప విన్యాసం, భంగిమలూ, అలంకరణ వైచిత్రి ప్రదర్శింప బడటానికి కారణం బహుశా కాకతీయ శిల్పులందరూ ఒకే సాంప్రదాయాన్ని, ఒకే రకమైన భావనా వైఖరిని అనుకరించడమే కావచ్చును. రామప్ప గుడిలో మాత్రమే మిగతా చోట్లలేని అత్యంత లలితమైన నిలువెత్తు నర్తకీ విగ్రహాలున్నాయి. ఇటువంటివి మొత్తం పండెండు శిల్పాలు దేవాలయానికి గల మూడు ద్వారాలకు పై భాగంలో ప్రతిష్ఠితమై వున్నాయి.

ఆనాటి నాట్య కళాకోవిదుడైన జాయన సేనాని విరుచిత నృత్త రత్నావళి లోని నాట్య భంగిమల ఆధారంతో ఈ శిల్పాలు రూపొందబడినాయని పేర్కొన బడు చున్నది. ఇవి మిగతా శిల్పాలులాగాక అలంకరణ విధానంతో అత్యంత నిరాడబరతను ప్రదర్శిస్తున్నా, భంగిమలోని సజీవ చైతన్యం రూపురేఖలలోని లావణ్యతవల్ల మిగిలిన శిల్పాలను మించి మనోహరంగా రూపొందినాయి.

ఈ మూడు చోట్ల కూడా ప్రధానంగా చెక్కబడినవి వివిధ భంగిమలతో వున్న నర్తకులు, వాద్యకులూనూ, ఏ విషయాన్ని తీసుకొన్న, ఏ రూపాన్ని ఎన్ను కున్నా, వాటికి ఆకారం యివ్వటంలో అత్యంత ప్రతిభను, ప్రజ్ఞనూ, ఓర్మిని ప్రదర్శించి, ప్రతి ఒక్క శిల్పాన్నికూడా మనోహరంగా, నిర్దుష్టంగా, మూర్తీభవించిన సౌందర్యరాసులుగా కాకతీయ శిల్పాలు రూపొందించారు. రాళ్ళే కరువైనాయా అన్నట్లు పై మూడుచోట్ల కూడా దేవాలయాల స్తంభాలనూ, గోడలనూ, గర్భ గృహాలనూ, పైకప్పునూ, చివరికి క్రింది నేలను సైతం సుందర శిల్పాలతో చిత్ర విచిత్ర గతులతో సాగిపోయే సంకులమైన అలంకార శ్రేణులతో నింపి వేశారు. రామప్ప

ల మీద కానరాదు. నర్తకీమణుల నమూనాలుగల శిల్పాలలో కేవలం మూడు నాల్గు అంగళాల నిడివి మాత్రమేగల మూపాలలో సైతం ప్రతి అంగాన్ని వివరణలతో సహా చెక్కి. తలకట్లనూ, వాటి అలంకార విధానంలోగల సామాన్య వివరాలనూ, చివరికి కాలిగోళ్ళనూ సైతం స్పష్టంగా తీర్చిదిద్దారు కాకతీయ శిల్పాలు.

మూర్తి శిల్పాలన్ని ఒక ఎత్తుకాగా అలంకార శిల్పాలూ వాటికి ధీటు రాద గినవే ఈ అలంకార శిల్పాలు దేవాలయ స్తంభాల పైభాగాలలోనూ, గర్భగుడిలోకి వెళ్ళే ద్వార బంధాలమీద వున్నాయి. వీటినే మకర తోరణాలు అంటున్నారు. వీటి లోని అలలు అలలుగా చిత్ర విచిత్ర గతులలో శిల్పి ఎంత ప్రజ్ఞను కనబరచాడో చిత్రణలో అంతకు మించిన ప్రతిభనూ ప్రదర్శించాడు.

నేటికీ నిలిచివున్న కాకతీయ శిల్పాలశేషాలన్నింటిలోకీ మేలుబంతి వంటిది రామప్పగుడి ప్రత్యంగళం శిల్పమయైన అపురూప కళా ఖండమిది వీటి వరవడితోనే రూపొందిన హంపీ శిథిలాలను చూసి, చూసి "అబ్బా" ఇక్కడే యీ క్షణంలోనే ఇలాగే చనిపోవాలనిపించింది నాకు. ఇంతటి మహోన్నతమైన శిల్ప కళా ఖండాలు చెక్కిన శిల్పులకు మనమెంతో ఋణపడి వున్నాం. నైపుణ్యంలో కాకతీయశిల్పుల భారతదేశంలోని మరే ప్రాంతపు వారికీ తీసిపోని ప్రతిభా సంపన్నులు కర్కశమైన నల్లని కొండ రాళ్ళే శిల్పుల చేతిలో వెన్నలా కరిగి వెన్నెలలాగా ప్రవహించి లోకం లోగల కళాకారుని ఊహకందగల సమస్త మూర్తి సౌందర్యాన్ని సంతరించుకొని ఘనీ భవించి శిల్పాలుగా రూపమొంది. ఈ దేవాలయాంగణాలలో అవాస మేర్పరచుకొని మానవునిలోగల రసచేతనకు దానికి ఆకారము ఇవ్వగల అతని నైపుణ్యానికి ప్రత్యక్ష తార్కాణాలుగా నిలిచి వున్నాయి. వీటివింత మనోహరంగా రూపొందించిన కాకతీయ శిల్పులు ఎంత ధన్యులో, శిధిల రూపంతోనైనా వీటిని దర్శించగల అవకాశాన్ని కల్గి వున్న మనంకూడ ధన్యులమే. స్వయం భూదేవాలయంతో శిథిల శిల్పాలు, రామప్ప గుడిలోని నాట్య భంగిమల్లో వున్న శిల్పాలు ప్రతి ఒక్కరూ చూడదగ్గ శిల్పాలే.



# బొజ్జన్న లింగాల కొండ సంఘారామ శిల్పాలు

శాంతమూర్తి బుద్ధుడు మూర్తీభవించిన కరుణారస స్వరూపం. అతని అహింసా తత్వం జీవకారుణ్యం పరమాశయాలే. అనాటి కళాకారుల రస హృదయాలను ద్రవింపజేసి, సంస్కృతి పథంలో ఒకవిశిష్టమైన శాస్త్రీయ కళకు నాంది పలికించాయి. దాని ఫలితమే బౌద్ధ యుగపు కళా ప్రపంచం. వారి కళా సృష్టి మూడు విధాలుగా సాగిపోయింది. మొదటిది వర్ణ చిత్రాల రూపాన బౌద్ధ జానపద గాథల నిర్మాణం, దాని నిదర్శనం అజంతా. నాగార్జున విహారాల చిత్రశాలలు. రెండవది చైత్యాలు, మహా చైత్యాలు నిర్మించి వాటిని సోపజ్ఞమైన శిల్పంతో అలంకరించడం, అమరావతి, నాగార్జున కొండలలో విలసిల్లిన కళా సృష్టి, మూడవది అనుకూలమైన ప్రకృతిచే ఆవరించబడిన కొండలను తొలచి, ఆ గిరి గర్భాలలో శాంతిమూర్తి రూపాలు స్తూప చైత్య సంఘారామాలు నిర్మించడం, ఇది అంధ్రలో రామతీర్థం, గుంటుపల్లె, శంఖరంలలో కనిపిస్తాయి.

తెలుగు తల్లి కంఠహారంలో ఓ మణిమాల బొజ్జన్న లింగాల కొండ సంఘారామ శిల్పమాల. ఇది విశాఖపట్నం జిల్లా అనకాపల్లికి సుమారు మూడు కిలోమీటర్ల దూరంలో కనిపించే ఒక చిన్న కుగ్రామమే శంఖరం. నాటి సంఘరామమూనూ, ఆ గ్రామానికి తూర్పుగా ఒకటి. పడమరగా ఒకటి, ఒకదానికొకటి చేరి రెండు కొండలు వున్నాయి. తూర్పు వున్న దానిని బొజ్జన్న కొండ, రెండవ దానిని లింగాలమెట్ట అని అప్పటి ప్రజలు వాడు కొంటారు. పూర్వం యీ రెండు కొండలకు దగ్గరగా ఉత్తర దిశగా శారదా నది ప్రవహించే దంటారు.

నేడు ఆ దివ్య ప్రశాంత వాతావరణంతో ఆవరింపబడిన ఆ గిరి ద్వీపం ఒక విచిత్రమైన సౌందర్యముతో దర్శనమౌతుంది. వాటి చుట్టూ సస్య శ్యామలమైన పంట పొలాలు పరివేష్టించి వున్నాయి. బొజ్జన్న కొండ క్రింది భాగంలో "హారతి" అనే స్త్రీమూర్తి శిలా విగ్రహం ఆరుబయట నిలబడి వున్నది. రెండు వైపులా చామర హస్తలైన యిద్దరు స్త్రీలు వున్నారు. పొడువుగా కిరీటమున్నది. ఎడమమోకాలు సగానికి మడచి వుంది కుడి కాలు క్రిందికి చాపి వుంది. ఎడమ తొడమీదొక శిశువు. ఈ స్త్రీ మూర్తి ఎడమ చేతితో శిశువును పట్టుకున్నట్లుంది. దక్షిణ హస్తం అభయ ముద్రలో వుంది. శిరస్సుకు యిరువైపులా శిశు విగ్రహాలున్నాయి, పూర్వం చంటి పిల్లలను

రెండవది పడమరగా వున్న చైత్య గుహాలయం [illegible]
చైత్య గుహాలయానికి రెండు వైపులా ద్వారపాలకుల విగ్రహాలు వున్నాయి. ద్వారం పై భాగంలో అర్ధ చంద్రాకారపు గూడు వున్నది. దాని మధ్య ధ్యాన బుద్ధుని విగ్రహం వున్నది. ఈ గుహ 9.5 మీటర్లు వెడల్పు 10 మీటర్లు పొడవు 175 సెం. ఎత్తు వుంది. నాలుగు సరుసల స్తంభాలున్నాయి. వీటి మధ్య వేదిక, అండము పేటిక గల ఒక చైత్యముంది మధ్య స్తంభాలపై పద్మ పాణులయిన దేవతా విగ్రహాలున్నాయి, ఈ గుహ పడమటి అంచు నుంచి ఒక మెట్ల వరుస గలదు, వాటిపై మరియొక గుహలో గోడ యిరువైపులా పెద్ద గూళ్ళు మలచబడి వున్నాయి. వాటిలో బుద్ధుని విగ్రహము, ఇరువైపులా పరిచారక విగ్రహాలు, పైన దేవతా విగ్రహాలు అడుగున చామర హస్త అయిన ఒక స్త్రీ ఒక భక్తుని రూపం చెక్కబడి వున్నాయి, ఈ గుహ గోడల నిండా శాంతమూర్తి శిల్పాలే. ఎటువైపు చూచినా ధ్యాన బుద్ధుని రూపాలే. చూపరులకు ఒక విధమైన అవక్తానుభూతిని కలిగిస్తాయి. ఈ గుహ ఎదుటి గోడ పడమర భాగంలో నాగ దేవతా విగ్రహం ఒకటి వుంది. తూర్పు వైపున మరొక ద్వారం. దాని వెనుక ఒక అంతర్గుహ, అందు ధ్యాన ముద్రలోనున్న బుద్ధుని మరో దివ్య విగ్రహం వున్నాయి. ప్రతి బుద్ధ విగ్రహమూ చిన్న చిన్న చైత్యాలతోనూ. దేవతా విగ్రహాల తోనూ, పరిచారక విగ్రహాలతోనూ, అలంకరించబడి వున్నాయి, కొండ ఉత్తరముగా తిరిగిపోతే అచ్చట మరో గుహ, దాని ముందు భాగపు గోడమీద వినాయకుని సుగ్రహము, లోపల ధ్యాన బుద్ధుని విగ్రహము కనిపిస్తాయి. అలా వెడుతుంటే వేదిక, అండము పీఠికలు. అనేక చైత్యాలు కనిపిస్తాయి. చైత్యాల మధ్య మరో ధ్యాన బుద్ధుని విగ్రహము కొండ నిండా తథాగతుని శాంతి స్వరూపాలే కనిపిస్తాయి. గుహాలయాల అంతర్భాగంలో వెలుగు లేకపోయినా, చీకటి కనిపించదు. ఒక విచిత్రమైన "శాంతి దీపం" దివ్యంగా వెలుగుతున్నట్లు అనిపిస్తుంది. మనస్సు క్షణ కాలం నిర్మల మౌతుంది. ఈ సువిశాల విశ్వంలో జీవిత కర్తవ్యాన్ని భోధిస్తున్నట్లుగా ఆ తథాగతుని దివ్య సుందర మంగళ రూపాలు వున్నాయి. శాంతికోసం బుదుని శరణువేడు అన్న ప్రభోద గీతం ఆ గిరి అంతర్భాగంలో నుంచి విన్పిస్తున్నట్లుంటుంది. మరి బౌద్ధం జీవ మృతమై విలసిల్లిన నాటి కళా విధానాలు మన హృదయాలను కదిలిస్తాయి.

కొండ పై భాగం రెండు అంతరవులోగల కొండ రాతిని, రెండుగా పగుల కొట్టి దానిలో తూర్పున ఒక విశాలమైన చదరం పడమర ఒక బ్రహ్మాండమైన స్తూపం ఏర్పడేటట్లు చెక్కారు. ఈ మహా స్తూపం చుట్టూ ప్రదక్షిణ పథం, దాని చుట్టూ చిన్న చిన్న చైత్యాలు, రాతితోను ఇటుకలతోను నిర్మించినవి వున్నాయి. చదరంపై

తూర్పు వైపు అర్ధ చంద్రాకృతిగల ఆరామం నిర్మించబడినట్లు తోస్తూంది. అయితే ఇప్పుడు లేదు. ఆ ఆరామం చుట్టూ ఇటికలతో చిన్న చిన్న గదులు నిర్మించి నట్లు శిథిలావస్థలోనున్న ఆ గోడలు చెబుతాయి. ఈ ఆరామమే సంఘారామం. ఇచ్చటనే బౌద్ధ విశ్వ విద్యాలయం వెలిసినట్లు చెబుతారు. ఇచ్చటి నుంచి సౌందర్య దేవతను, ప్రకృతి కన్యను నగ్నంగా దర్శించగలము. పచ్చని పంట భూములు దూరపు నీలి కొండలు, ఆ తరువాత అనంత ఆకాశం అప్యాయతతో పలకరించినట్లు కన్పిస్తూంది.

బొజ్జన్న కొండకు పడమట నున్న లింగాలకొండమీద రాతితో రెండు వరస లతో కొన్ని వందల చైత్యాలు చెక్కబడి వున్నాయి. ఈ చైత్యాలు కొండ శిఖరం వరకు ఆవరించి వున్నాయి. ఈ కొండ పడమటి భాగంలో మహా చైత్యాల ముందొక గుహ నిర్మించబడి వుంది. ఈ కళా సృష్టి క్రీస్తు పూర్వం ఒకటవ శతాబ్దం క్రీ. శ. రెండవ శతాబ్దపు మధ్య కాలంలో జరిగిందని నాల్గవ శతాబ్దంవరకు దివ్యంగా వెలిగిం దని చరిత్రకారుల నిర్ణయం, ఇది ప్రస్తుతం పురాతత్వశాఖవారి ఆధీనంలో వున్నది. అనకాపల్లి నుండి ఇప్పుడిప్పుడే రోడ్డు వేశారు, ఈ కళా సృష్టి మన తెలుగు తల్లి మణిమాల. బౌద్ధులనాటి సంస్కృతికి కుంకుమ రేఖ. ఆంధ్రుల గర్వించదగ్గ శిల్ప కళా వైభవం.



# లేపాక్షి విరుపణ్ణ శిల్ప నిక్షేపాలు

ఆది నుంచి ఆంధ్రదేశము లలిత కళలకు కాణాచి. వాఙ్మయ పరముగా నన్నయనాటి రాజ రాజ నరేంద్రుని కాలం నుండి ప్రారంభమైననూ తరువాత తరువాత శిల్ప కళా వైభవమునకు కూడా పేరెన్నిక గన్నను విజయనగర రాజుల పాలనలో ఆంధ్ర సంస్కృతి అన్ని రంగాలలో తనకుతానే సాటి అనిపించుకొన్నది. సాహితీ పరంగా "మను చరిత్ర అముక్తమాల్యద" ఇత్యాది గ్రంథములు సాక్ష్యములై నిలుపగా సకల కళా పోషణ జరిగినట్లు చారిత్రక శాసనపరమైన ఆధారములు వుండగా శిల్పము, చిత్ర కళాపరముగా హంపి, లేపాక్షి సజీవ సాక్ష్యములై నిలిచి వున్నాయి. మన శిల్ప కళా వైభవమునకు అద్దము పట్టిన ఈ రెంటిలో హంపీ దురదృష్టవశాత్తు శిథిలావస్థలో వున్ననూ, లేపాక్షి చెక్కు చెదరక నిలిచి వున్నది. అంతేకాగా కారణాంతరముల వలన అసంపూర్ణముగా వదలి వేయబడిన, ఈ ఆలయాన్ని సంపూర్ణ కళా నిలయంగా తీర్చి దిద్దాల్సిన అవసరం వుంది. ఇట్టి లేపాక్షిని గురించి ఈ ఆలయకర్త అయిన విరుపణ్ణను గురించి ఎరుగనివారు వుండరు.

అనంతపురం జిల్లా హిందూపురం (నియోజకవర్గం) నుండి 16 కి. మీ. దూరంలో వున్న లేపాక్షి కొండ అతి ప్రాచీనమైన కూర్మశైలమని పిలువబడు చుండెనని స్థల పురాణమువల్ల తెలుస్తూంది. ఋగ్వేదములోని అనేక ఋక్కులను రచించిన అగస్త్య మహర్షి ఈ కూర్మశైలమున ఒక చిన్న ఆలయమును వెలయింప జేసెననియు ఆనాటి నుండియు పాపనాశేశ్వరాలయం అను పేరుతో గొప్ప శైవ క్షేత్రముగా పరిగణిలోనికి వచ్చెననియు తెలియుచున్నది. ఈ లేపాక్షి భారత దేశములోని 108 ప్రఖ్యాత శివ క్షేత్రములలో ఒకటిగా స్కంద పురాణములో ప్రస్తావింపబడుట గమనార్హము. అట్టి శిల్ప కళకు కాణాచి అయిన లేపాక్షి ఆలయము అసంపూర్ణమైన విరుపణ్ణ గాథ అనేక విధములుగా ప్రచారములో వున్నది.

కూర్మశైలమని పిలువబడు యీ లేపాక్షి పాపనాశేశ్వర ఆలయమునగల శివమూర్తిని చూచి విరుపణ్ణ తన్మయుడై అత్యంత నిరాడంబరమైన యీ ఆలయమును వైభవోపేతము చేయ సంకల్పించెను. ఈతడు విజయనగర రాజ వంశీయుడైన అచ్యుతరాయుని కోశాధికారులలో ఒకడై వుండెను. ఈ ఆలయ నిర్మాణార్థం ఖజానా ధనమును వినియోగించి గొప్ప గొప్ప శిల్పకారులు, చిత్రకారులను నలు మూలల నుంచి పిలిపించి ఆలయ నిర్మాణమున నిమగ్నుడై వుండెను. గిట్టనివారు కొందరు

పీకించుటకు ఆజ్ఞాపించెను. ఈ విషయం విశ్వసనీయంగా తెలుసుకొన్న విరుపణ్ణ స్వయంగా తన కను గ్రుడ్లను పెరికి పడమటి దిశ గోడకు బలంగా విసిరికొట్టెను. ఆ కను గ్రుడ్లు ఆ గోడకు అట్లే పాతుకొని రక్తపు జీరలతో నేటికి నిలిచి వున్నవి. ఆ తరువాత తాను సంకల్పించినట్లు ఆలయ నిర్మాణము పూర్తి కానందులకు కృంగి కృశించి ఆ ఆలయములోనే వెర్రివానివలే తిరుగుతూ మనోవేదనతో తన జీవితము ముగించాడని ఒక గాథ ప్రచారంలో వున్నది. దీని నిజానిజాలు తెలిసుకోడానికి ఖచ్చితమైన శాసన పరమైన ఆధారాలు లేకున్నను ఆలయ పడమటి దిశ గోడపై మాత్రం ఇప్పటికి శాశ్వతంగా సజీవములా ఆశ్చర్యము కలిగించే నిలిచివున్న రెండు కళ్ళ గుర్తులు వాటివెంట రక్తపుచారలు ఆ గాథకు ఆధారంగా కన్పిస్తాయి. కాగా ఈ ఆలయంలోగల అనేక శాసనములలో చివరిది అయిన క్రీ.శ, 1548 నాటి శాసనమును బట్టి ఈ ఆలయ నిర్మాణము అచ్యుత రాయల కాలమునాటి విరుపణ్ణతో ప్రారంభమై విజయనగర క్షీణదశవరకు కొనసాగుచునే వుండి విజయనగర సామ్రాజ్య పతనాంతరం ఆ సంపూర్ణస్థితిలోనే ఉండి పోయినట్లు తెలుస్తూంది,

ఏది ఏమైనప్పటికి ఈ ఆలయ విశిష్టత, ప్రాచీనత. ఇందులో ఆలయ శిల్ప కళకోసం కృషిచేసిన విరుపణ్ణ చూపిన శ్రద్ధాశక్తులు ఈ ఆలయ అసంపూర్ణ స్థితిలోనే వుండుటకు వెనుక ప్రచారంలో వున్న విరుపణ్ణ "కను గ్రుడ్లు" శాశ్వత చిహ్నములు ఎటువంటి వారి హృదయములనైనా ద్రవించేటట్టు చేయక మానవు. ఇక్కడి ప్రధాన ఆలయము వీరభద్రేశ్వర ఆలయం. ఈ ఆలయాన్ని ఆవరించుకొని ఎన్నో చిత్ర శిల్ప ఖండాలు వున్నాయి.

రావణాసురుడు సీతాదేవిని దొంగలించుకొని తీసుకొనిపోయిన తరువాత శ్రీరాముడు వెదుకుతూ జటాయువును కలిసిన స్థలం ఇదేనని. పడిపోయిన జటాయును "లే-పక్షి" అని శ్రీరాముడు ఉచ్చరించి లేపి మోక్ష మొసగినట్లును లేపక్షి క్రమ క్రమంగా వాడకలో లేపాక్షి అయినటున్న వాఖ్యానిస్తారు. అందుకు తగినట్లుగా ఆలయంలో సుమారు యిరవై అంగుళాల పొడవు వున్న ఒక పాదం సీతాదేవిదేనని అంటారు. ఈ వాదానికి తగినంత ఆధారాలు వున్నట్లు కన్పించదు. అగస్త్య మహర్షి లేపాక్షివద్ద కూర్మాచలముపై పాపనాశేశ్వరుని ప్రతిష్టించినాడనీ. లేపాక్షి అనే పేరును అప్పటి ఋషులే పెట్టినట్లు మరొక కథను కల్పించారు కొందరు.

దేవాలయ నిర్మాణాలు సాధారణంగా వాస్తు ప్రాధాన్యం గలవి. వాస్తు నిర్మాణం కలిసిపోవడానికి సహకారంగా వుంటాయి, కనుగ శిల్ప నిర్మాణాలే ప్రాధాన్యం

ఈ శిల్పాలన్నికూడా రేఖారచనలో, భంగిమ కల్పనలో, నిర్మాణ నైపుణ్యంలో సున్నితమూ, మనోహరమైన సౌందర్యమూర్తులు స్త్రీ రూపాలు ఎంతో శ్రద్ధతో రూపొందింపబడ్డాయో, పురుష విగ్రహాలుకూడ అంతే శ్రద్ధతో నైపుణ్యంతో మలచబడ్డాయి. రేఖా నిర్మాణంలో అలంకార ప్రక్రియలో కాకతీయ శిల్పాలతో దగ్గరి పోలికలు కన్పిస్తాయి ఈ లేపాక్షి శిల్పాలలో కాకతీయ శిల్పాల్లాగే వీరూ నల్లరాతినే వుపయోగించారు. నిండైన, సున్నితమైన అంగ నిర్మాణంతో చైతన్యవంతమైన భంగిమలతో ఈ శిల్పాలలో జీవ కళ ఉట్టి పడుతూంది.

ఇక్కడ రూప సౌందర్య పోషణ ప్రధానమైన శిల్పాలు అధికంగా వున్నాయి. అయితే అంతటితోనే ఆగక కొన్ని పురాణ ఘట్టాలను కూడా ఎన్నుకొని రూప కల్పన చేశారు. ఇక్కడ శిల్పాలు వీటిలో అటు భావ ప్రకటనా, ఇటు రూప సౌందర్యము రెండూ కూడ వున్నత స్థాయిలో పోషింపబడ్డాయి. వీరభద్రేశ్వర ఆలయ స్తంభంపై గల "బిక్షాటనమూర్తి" శిల్పి ఇందుకు ఉదాహరణ. ఈ శిల్ప సృష్టిలో శిల్పి సృజన శీలత ప్రసంశనీయం. బిక్షకు వెడలిన పరమ శివుడు, బిక్ష వేస్తున్న పార్వతీ ఇందులోని శిల్పగీత రూపాలు.

ఇక ఆలయ ఆవరణసులోని వున్న మరొక శిల్ప కళా మందిరం కళ్యాణ మంటపం. ఇది అసంపూర్తిగా వున్నప్పటికి ఇందులో శిల్పాల కళా చాతుర్యం ప్రశంసనీయం, గిరిజా కళ్యాణానికి ఐరావతం మీద ఇంద్రుడు పొట్టేల మీద అగ్ని, మహిషం మీద యముడు మొదలగు పెళ్ళి పెద్దలు బయలువేరే దృశ్యం ఎంతో చక్కగా చిత్రీకరించబడింది. ఈ స్తంభాల మీద వివిధ భంగిమలలో చెక్కబడిన భరతనాట్య విన్యాసాలు, యోగ ముద్రలు ఎంతో ఆకర్షణీయంగా అగుపించుతాయి. ఒకేచిత్రంలో మూడు రకాలుగా అగుపించే ఆవు (దూడకు పాలు ఇవ్వటం, మేత మేయటం పైకి చూడటం) నాలుగు కాళ్ళు వున్న ముగ్గురు పురుషుల చిత్రాలు "భళా" అనిపించే శక్తి గలవి,

ఆలయం వెనుక వైపుగా వున్న ఏడు తలల నాగు, దక్షిణ భారతదేశంలోకెల్లా అతి పెద్దదని పలువురు తమ అభిప్రాయాలను వ్యక్తం చేస్తున్నారు. తల్లి అన్నం వండి భోజనానికి పిలిచేటంత సమయంలో దీని నిర్మాణాన్ని శిల్పి ముగించాడనీ, ఆమె (తల్లి) దృష్టి తాకి లింగం క్రింద రాయి పగిలి పోయిందని అక్కడి కథనం ప్రకారం తెలుస్తూంది. ఇప్పటికీ క్రింది రాయిలో మనకు పగిలిపోయిన రాయి కని

రెండవ ప్రాకారంలో ఒక పెద్ద మంటపం వున్నది. దీనిలో స్తంభాలమీద దేవ సభకు వేంచేసి తన నాట్య కౌశల్యాన్ని ప్రదర్శిస్తున్న రంభ చేస్తున్న నాట్యం తిల కిస్తున్న శివుడు. పార్వతి, బ్రహ్మ, తుంబరుడు, నారదుడు, సూర్యుడు, చంద్రుడు మున్నగువారి మూర్తులను అందంగా చెక్కినారు. ఇక్కడ ముఖ్యంగా చూడవలసి నది యీ మంటపం లోనే ఒక ప్రక్క దాదాపు పది అడుగుల పొడవు అడుగున్నర చదరముగల ఒక స్తంభం పైకప్పు నుంచి వ్రేలాడుతున్నది. దీనిని పరిశోధించడానికి వచ్చిన తెల్లదొర ఇంజనీయరు శ్రీ హామిల్టన్ దీనిని ప్రక్కకు నెట్టించాటడ. అందుచే ఇప్పుడు దాదాపు రెండు మూడు అంగళాలమేర తప్ప మిగతా భాగమంతా నేలకు దాదాపు అర్ధ అంగుళం పైన వున్నది. ఇది ఎలా నిలబెట్టగలిగారో ఇప్పటి మన ఇంజ నీర్లకు అంతు చిక్కడం లేదు.

కళ్యాణ మంటపం దిగితే, ముందు కొద్ది దూరాన " దుర్గాంబ పాదం " అది దాదాపు రెండు అడుగుల పొడవు. రెండు అంగుళాల లోతున రాతితో తొలచిన పాద చిహ్నము వున్నది. అందులో నీళ్ళు అన్ని కాలాల్లోనూ తొణికిసలాడు తూంటుంది. నీళ్లు ప్రక్కకు చల్లివేసినా, కొంత పగులు నుండి మంటపం క్రిందుగా సన్నని నీటి చాలు వచ్చి పాదం సాయంత్రానికల్ల కనిపించని రీతిలో నిండి పోతుంది.దా ని కెదు రుగా పెద్ద కోనేరు వుంది. వచ్చిన యాత్రికులు స్నానాదులు అక్కడ తీర్చుకోవచ్చును.

ఈ శిల్పాలన్ని ఒక ఎత్తుకాగా. లోపల గోడలమీద, పైకప్పుమీద రూపొందించ బడిన వర్ణ చిత్రాలు ఒక ఎత్తు. చిత్రణ విధానంలోని నైపుణ్యంవల్ల అందరినీ ఆక ర్షించగల నిండుదనాన్ని కలిగి వుండటం మాత్రమేగాక, చారిత్రక ప్రాముఖ్యాన్ని కూడ కలిగి, ప్రస్తుత నవీన యుగంలో అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేస్తున్నాయి యీ లేపాక్షీ చిత్రాలు. శిల్పాలలో అలంకరణాత్మకమైన రూప సౌందర్యమూ భంగిమా, కల్పనా ప్రాధాన్యం వహించగా చిత్రాల్లో రేఖా సౌష్టవం, వాస్తవిక చిత్రణా ప్రాము ఖ్యాన్ని సంతరించు కొన్నాయి, శిథిలమైనవి, కానివీ కలిసి కొన్ని వందలదాకా వర్ణ చిత్రాలు వున్నాయి, వీటిలో ప్రధానంగా శివ లీలలూ, శివ సంబంధమైన పురాణ గాథలు, చిత్రింప బడ్డాయి, రేఖా రచనలోని నేర్పు వ్యక్తి రూపాలకు ప్రాణం పోయగా అలంకరణ విధానం వాటికి అదనపు సౌందర్యాన్ని ఆకర్షణను కల్పించింది.

లేపాక్షి చిత్ర, శిల్ప కళల రెండింటి విశిష్టత సమ్మేళనం. ఒకనాటి పుణ్య క్షేత్రం, ఈనాటి కళా కేంద్రం, ఇక్కడి నందీ శిల్పాన్ని ముగ్ధులు కానివారు వుండరు నంది లేని శివాలయం వుండదు. అది ఏ ప్రాంతమైన ఏ దేవాలయమైనా శిల్పి తన

చాతుర్యాన్ని, శక్తిని పరిపూర్ణంగా ప్రదర్శించాడు. నంది విగ్రహాన్ని మలచటంలో చూపిన ప్రజ్ఞ చరిత్ర పుటల్లో శాశ్వతంగా నిలిచేటట్టు చేశాడు. ఠీవిగా కూర్చున నంది మెడలో చిరుమువ్వల గంటల పట్టెడంతో కూర్చున ఈ నంది ఇరభై అడుగుల ఎత్తు ముఫై అడుగుల పొడవుగల జీవ చైతన్య విలసితమైన గంభీర మూర్తి. ఈ చిత్రణ సామర్థ్యాన్ని. జీవ కళను చూసే తన్మయులైన శ్రీ అడవి బాపిరాజుగారు "లేపాక్షి బసవయ్య లేచి రావయ్య" అన్నారు. నేటికి నిలబడివున్న అమూల్యమైన నిక్షేపం.

# తాడిపత్రి దేవాలయాల శిల్ప కళా వైభవం

విజయనగర చక్రవర్తుల కాలంలో రాయలసీమ ఓ రతనాలసీమ, కళలు విరసిన కాంతిసీమ, రాగాలసీమ అనురాగాలసీమ. ఈ సీమ దుర్గాలతో, అంతఃపురాలతో, అద్భుత దేవాలయాలతో, అందమైన సరోవరాలతో విరాజిల్లేది. ఇక్కడి దేవాలయాలు శిథిలావస్థలో వున్నప్పటికి కళా వైభవం మాత్రం చెక్కు చెదరలేదు. విజయనగర చక్రవర్తుల శిల్ప కళా సంపదకు తాడిపత్రి దేవాలయాలు గీటురాయి అంటే ఆశ్చర్య పడాల్సిన అవసరం లేదు. ప్రాచీన ఆంధ్రుల కళావైభవం ప్రదర్శించే దేవాలయాల్లో హంపీ తరువాత తాడిపత్రిలో చూడవచ్చును. అనంతపురంనకు 60 కిలోమీటర్ల దూరంలోవున్న తాలూకా కేంద్రము. మద్రాసు-బొంబాయి బ్రాడ్‌గేజ్ రైలు మార్గంలో వున్నది ఇక్కడ అచ్యుతరాయల కాలం నాటి రెండు పురాతన దేవాలయాలు వున్నాయి. అందులో మొదటిది చింతల వెంకటరమణస్వామి దేవాలయం. రెండవది బుగ్గ రామలింగేశ్వరస్వామి దేవాలయం. చింతల వెంకటరమణస్వామి వైష్ణవులకును బుగ్గ రామలింగేశ్వరస్వామి శైవులకును ఆరాధ్య దైవాలు. చింతల రాయల దేవాలయం బుక్క రాయుల కాలంలోను, రామలింగ దేవాలయం ప్రౌఢదేవ రాయుల కాలంలోనూ నిర్మించ బడ్డాయి. ఎవరైనా యీ దేవాలయ స్థలాన్నిచూస్తె మత ద్వేష తాకిడిని తప్పించుకొని తమ సొంపులు తిరిగిన శిల్ప గరిమను చూపిస్తున్నాయి. ఈ రెండు దేవాలయాలు ఒకే విధమైన ఫక్కీలో విజయనగర రాజుల కాలంలో నిర్మించ బడ్డాయి. అనన్య సామాన్యమైన నిర్మాణాత్మకములై తమ గొప్పదనంతో నేటికిని చూపరుల నేత్రాలను ఆనందభాష్పాలతో చెమ్మగిల్లిస్తాయి, ఈ కట్టడాలు పునాదుల నుంచే వుత్తమ శిల్ప నిర్మాణాలతో వున్నాయి. ఈ దేవాలయాలు తమ అలంకార సౌభాగ్యాలతో కర్నాటకలోని 12వ శతాబ్దపు ప్రఖ్యాత హొయసళ దేవాలయ నిర్మా

ఇక్కడ వెలసిన వేంకటేశ్వరునికి వెంకటరమణుడని నామము కలదు. వాడుకలో దీనిని గురించి గల గాథ ఒకటున్నది. శ్రీ వెంకటరమణస్వామి విగ్రహం రెండు చింత చెట్ల మధ్య భాగం నుంచి ఒక ఆసామికి కనబడిందట. ఆతడే ఆ చెట్లను తొలగించి ఈ దేవాలయానికి పునాది వేసినట్లు వాడుక వున్నది. అందుకనే యీ దేవుడికి "శ్రీ చింతల వెంకటరమణ" అని వాడుక కలదు. సామాన్యంగా చింతల రాయుడని అంటారు. ఈ దేవాలయానికి ఎత్తైన ప్రాకారము వున్నది. గర్భగుడి ఎదురుగా ఒక పడిపోయిన గోపురము వున్నది, అయినా దాని అధిష్టానం. కుడ్యం మాత్రం మిగిలాయి. ఈ గోపురంపై శిల్పకారులు కొద్ది స్థలం కూడ వదలక శిల్పాలను చెక్కారు. పడిపోయిన గోపురం నుంచి లోపలికి రాగానే మనకు ఒక రాతి రథం కన్పిస్తుంది. ఈ రాతి రథం పూర్తిగా హంపీలోని విఠలస్వామి దేవాలయంలోని రాతి రథం వంటిది అయితే దీని చక్రాలు హంపీలోని రథంలాగా కాక. రాతిలోనే కదలకుండా అమర్చబడినాయి. దేవాలయపు వివిధ భాగాలైన ఉప పీఠం, అధిష్టానం, కుడ్యం, కపోతం ప్రస్తరం. గ్రీవం, శిఖరం ఈ రాతి రథంలోనే అమర్చబడి వున్నాయి. దీని పనితనం కూడా విశిష్టంగా వున్నది. దీనికి చేరువలోనేవున్న బలిపీఠం కూడ ఉత్కృష్టమైన శిల్ప కళని విలసిల్లుతున్నది. ఈ రాతి రథంలో వున్న రెండు రంధ్రాలద్వారా సూర్య కిరణాలు ప్రసరించి గర్భ గుడిలోవున్న శ్రీ వెంకటరమణస్వామి పాదాలపై పడతాయి. ఈ కిరణాలు నవంబరు నెలలో స్వామి పాదాలపై పడుతాయి ఇక్కడ వుండే అస్థాన మంటపం హంపీలోని విఠలాలయంలోగల సప్తస్వర మంటపంలోని ఒక స్తంభం మాత్రం సప్తస్వరాలూ పలుకుతుంది. ఈ మంటపంలో విజయనగర కాలానికి సంబంధించిన ఆరు రకాల స్తంభాలు కనబడతాయి, కదం త్రొక్కుతున్న గుర్రం చెక్కిన స్తంభం చూడ ముచ్చటగా వున్నది. అంతరాళపు ద్వారం శిల్ప వైభవంతో విలసిల్లుతున్నది, అంతరాళం,గర్భ గుడి, వీటి వెలుపలిగోడలపై శ్రీ మద్రామాయణ శ్రీమద్భాగవతాల నుండికొన్ని ఘట్టాలు చిత్రించబడినాయి, ఇచ్చటి ప్రత్యేకాకర్షణ శ్రీ కృష్ణుడు గోవర్ధన గిరి ఎత్తిన ఘట్టం, ఇందు గొల్లలు శిరస్సులపై గొనె సంచులు కప్పుకున్నట్లుగా చిత్రీకరింపబడినది.

అంతరాళానికి ఆనుకోని గుండ్రని ఆకారంలో శ్రీ స్వామివారి ఏకాంత సేవా మందిరం వున్నది. ఈ మందిరం కూడా పైన పేర్కొనబడిన దేవాలయంలోని వివిధ భాగాలతో తీర్చబడినది. ఈ దేవాలయం తూర్పు గోపురానికి కుడి వైపుగా విఘ్నేశ్వరుని ఆలయం, లక్ష్మీనారాయణ ఆలయం వున్నాయి, నైఋతి దిక్కున యాగశాల వున్నది. ఈ ఆలయ ప్రాకారపు గోడ చుట్టూ ఎత్తైన స్తంభాల మంటపం వున్నది.

సు చెబుతారు. రామలింగేశ్వరస్వామి విగ్రహం పూర్వం నీటి బుగ్గలలో వెలిసినందు వలన ఆ స్వామికి ఈ పేరు స్థిరమైనదట. ఈ ఆలయానికి ఉత్తర, దక్షిణ పశ్చిమా లలో మూడు గోపురాలు వున్నాయి. ఈ గోపురాలు దురదృష్టవశాత్తు శిథిలమైనాయి. ఈ మూడు గోపురాలు కూడా విశిష్టమైన కళా వైభవం చాటుతున్నాయి.

రామలింగేశ్వరస్వామి గర్భగుడిలోని లింగభూమిలో నుండి చొచ్చుకొని వచ్చి నట్లున్నది. ఈ గర్భ గుడికి కుడి, ఎడమ వైపులలో కోదండరామస్వామి, పార్వతి ఆలయాలు వున్నాయి. ఈఆలయం ఈశాన్య దిశలో చండీ ఆలయం వున్నది. చండీ ఆలయాన్ని ఆనుకొని ఎత్తైన స్తంభాల మంటపం వున్నది, రామలింగేశ్వరస్వామికి ఎదురుగా నంది వున్నది. నందికి చెరువలోవున్న గోపురం నుండి చూస్తే సదా ప్రవ హించే పినాకినీ నది కన్నుల పండువుగా కన్పిస్తుంది. అదే దృశ్యం ఉత్తరపు గోపురం నుంచి కూడా కన్పిస్తుంది. ఈ ఆలయం ఆవరణంలో రెండు విడి విడిగా శిలాశాస నాలు వున్నాయి.

వర్షా కాలంలో రామలింగేశ్వరస్వామి దేవాలయాన తన నాథుని కలుసుకోందా మా అన్నట్లుగా గంగాదేవి ప్రకృతి ద్వారా ఇక్కడ చేరుతుంది, ఈ ఆకాశ గంగ దేవాలయ శిఖరాల్ని తాకుతుంది. శిఖరాల్ని తాకిన గంగ ధారలతో దేవాలయ ప్రాం గణంలోనికి దొర్లి పారుతుంది. పారిన గంగ పెన్నాలో విలీనమౌతుంది. ఒక్కొక్క ప్పుడు పెన్నా నది వుద్వేత్తున గంభీరంగా వెల్లువలై పొంగి. భక్తి ప్రవత్తులతో వున్నట్లు దేవాలయ ప్రాంగణంలోకి వంగి తొంగిచూస్తుంది. ధూళి ధూసరితమైన ప్రాం గణపు మైలను ప్రకృతే నదీ దూతవల్ల శుభ్రం చేస్తుందా? అన్నట్లు వుంటుంది; పెన్నానది చాల ఎత్తు ప్రదేశాన్నుండి మిక్కిలి పల్లమవుతూ వస్తున్న దారి గుండా ప్రవహిస్తుంది. కాబట్టి వెల్లువ ఎక్కువ కాలం వుండదు. అప్పుడు దేవాలయంలో ప్రశాంతత, ప్రమోదాలు ముద్దులాడు కొన్నట్లుండి హృదయానందకరాలవుతాయి. ఈ దేవాలయాల పునరుద్ధరణకు తాడిపత్రిలోని వైశ్యులు ఎంతో తోడ్పడినారు. పడ మటి వైపున వున్న గోపురం పునరుద్ధరించిన ఖ్యాతి వీరికే దక్కింది, ఇటు యాత్రి కుల సౌకర్యాలకు వసతి గృహాలు సత్రాలు వున్నాయి. దేవాలయ ధర్మకర్తలు కార్య నిర్వాహణాధికారి. పూజారులు దేవాలయ అభివృద్ధికోసం అహర్నిశం కృషిజేయడం ఎంతో ప్రశంసనీయమైనది. విజయనగర రాజుల శిలా శిల్ప వైభవం చూడగోరిన వారికి తాడిపత్రి దేవాలయ ద్వయం ఒక గీటు రాయి.



# ముఖలింగంలో సోమేశ్వర ఆలయ శిల్పాలు

ప్రాచ్య ప్రపంచాన దేశ దేశాల్లో అనేక జాతులు, మతాలు సహస్రాబ్దాల పూర్వం చేసిన రూప కల్పన వృక్ష పూజ, ఔషధీశ పూజ మన దేశంలో మరే ఆల యంలోను కనిపించని వింత రూపపు శివుడూ, శిల్ప కళా ప్రాశస్త్యానికి ప్రమాణ మనదగిన బ్వార శిల్ప సౌందర్యం, ఇవన్నీ ముఖ లింగాన చూడవచ్చును, ముఖ లింగం మధూక లింగ అనే శబ్దం నుంచి పుట్టిందని ముక్తలింగం నుంచి పండితులు అభిప్రాయపడుతున్నారు. ముఖలింగ శిల్పాలను చూస్తే ఆనాడు శృంగారానికి, స్త్రీరూప లావణ్యానికి ఎంతో ప్రాముఖ్యత యిచ్చారని తెలుస్తూంది. శ్రీకాకుళం జిల్లాలో ముఖ లింగం ఒకచిన్న కుగ్రామం. ఈ గ్రామంలో మూడు శైవ దేవాలయాలు వున్నాయి. వీటివాస్తు ఉత్కళ సాంప్రాదాయ మైయిందని అంటారు. కానిశిల్పంలో మగధ కుంతల సాంప్రదాయాలు లేకపోలేదు. ముఖలింగంలో చూడదగినవి అనేక శిల్పాలు వున్నాయి వాటిలో ముఖ్యమైనవి మూడు దేవాలయాలు వున్నాయి. ముఖలింగేశ్వర ఆలయం సోమేశ్వర ఆలయం, భీమేశ్వర ఆలయం, కడపటివి రెండు శిథిలావస్థలో వున్నాయి.

ముఖలింగం గ్రామ కంఠాన ప్రాకారం మండపం మరేమి లేకుండ పశ్చిమా భిముఖంగా వున్నది. సోమేశ్వర ఆలయం కాసింత కాసింత వ్యత్యాసంలో లతా శిల్ప ప్రతిమలు మలచి పెట్టిన శిలా ఫలకాలు యీ ఆలయ నిర్మాణంలో చోటు చేసు కొన్నాయి, ఈ ఆలయంపై నున్నమహిషమర్దని అసురుడు మహిషం నుండి వచ్చినట్లు వున్నందున బహు పురాతన నిర్మాణం కావడానికి ఆధారం, హరిహర అర్ధనారీ శ్వర. కుమార, లకులీశ. గణపతిశైవ, శాక్తేయ రూపాలున్నాయి. "కామ సూత్రా" లకు రూపకల్పన చేసిన చోటుగాని ఆలయ నిర్మాణ చరిత్ర చెప్పే శాసనాలు లేవు. శిల్ప ప్రతిమా లక్షణాలను బట్టి కీ. శ. 9 వ శతాబ్దం ద్వితీయార్థంలో నిర్మించబడి వుంటాయని పరిశోధకులు అభిప్రాయం.

భీమేశ్వర ఆలయంపై రెండు దేవాలయాలకు మధ్య పూర్వాభి ముఖంగా క్రిక్కిరిసిన పశువుల పాకలు, పూరిండ్ల మధ్య వున్నది. ఇది అనియంకభీమ తృతీయ వజ్రహస్తుడు కీ.శ. 859-74 లో ప్రతిష్ఠించి వుంటాడని తెలుస్తూంది. ఈ ఆలయం లో చాళుక్య సాంప్రదాయం చాలా వున్నది. ఈ మూడు దేవాలయాలలోను ముఖ్య మైనది, పురాతనమైనది, చారిత్రాత్మకమైనది, సత్యాన్వేషణ చేయవలసినదీ మధు కేశ్వర ఆలయం. ఈ ఆలయ నిర్మాత ఎవరో తెలుపే శాసనాలు లేవు. ఈ దేవాలయం లోని శతాధిక శాసనాలలో పురాతనమైనది, అనంతవర్మ తృతీయ వజ్రహస్త దేవుని

ఆలయ సింహద్వారం వద్ద కనిపించే శిలా ఖండంపై ధనుర్ధారి [illegible] పరా భూతుడైన మానవుని శిల్పాన్ని కిరాతార్జునీయ గాథ అంటారు. అయితే ఇది ఒకానొక చరిత్రాంశాన్ని సూచిస్తుందని నా అభిప్రాయం. ఆలయ ప్రవేశ ద్వార తోరణంపై అపూర్వమైన శిల్పం వుంది. దీనిపై ఎంతోకాలం వాద ప్రతివాదాలు జరిగాయి. ఈ శిల్పంలో మధ్యన ఒక చెట్టు దాని కుడి ప్రక్కన పాము పుట్ట దాని కుడి ప్రక్కన సురామత్తుని భంగిమలో బోయరాజు ఒకడు పెద్ద కత్తితో ఆ చెట్టును నరక బోవడం అతని వెనుక ఒక నాగరిక స్త్రీ పూలసజ్జతో నమస్కరిస్తున్నట్టు. ఆమె వెనుక ఒక బోయవనిత, ఆ వెనుక ఆయుధ పాణులు శిల్పించ బడ్డారు. దీనికి చెప్పే పురాణ గాథ ఇది. హిమాలయాన "వైష్ణవ యాగా" నికి వచ్చిన గంధర్వులు అచటి శబర స్త్రీలను కామించారట. వామ దేవ ఋషి శపించగా వారంతా కాళింగాన శబరయోనిలో జన్మించారట. రాజు చిత్ర (కంఠ) గ్రీవుడు, రాణి చిత్ర, శ్రీశైలం నుండి కాశీ పోతూ దారితప్పిన శివ దీక్షా పరురాలు చిత్కళ రెండో భార్య వాకిటగల ఇప్పచెట్టు రెండు కొమ్మలు వంచి వాటి క్రింద రాలిన పూవులు ఏరుకొని బ్రతక మన్నాడట. చిత్కళకు బంగారు పూలు దొరికేవట, ఆమె వాటిని సుమంతపురంలో అమ్మేదట, కొమ్మలు మార్చి మార్చి ఇచ్చినా అమెకు బంగారు పూవులే దొరికేవట. రగిలిన సవతుల కయ్యానికి కారణం చెట్టుకదా అని శంబర నాయకుడు మధూక వృక్షాన్ని ఛేదించడానికి పూనుకోగా శంకరుడు చెట్టునుండి రౌద్ర రూపాన్ని చూపించగా ఈ చిత్రగ్రీవుడు మూర్ఛిల్లినాడట. చిత్ర సవతి కారణంగా భర్త మరణించినాడెమోనని శబరులకు చెప్పుకోగా వారు చిత్కళను చంపడానికి వచ్చారట. అప్పుడు శివుడు సౌమ్యరూపాన సాక్షాత్కరించగా ఈ గంధర్వులు శాప విముక్తులై నిజవాసమునకు పోగా శబరులకై శబర దైవంగా మధూక వృక్షం నుండి సాక్షాత్కరించినందుకు మధుకేశ్వరుడుగా దేవుడు నిలిచి పోయాడట,

ఈ శిల్పంలో ఎవరూ చంపవచ్చినట్లుగాని, చెట్టు నరుకుతున్నట్లుగాని కన్పించదు. ఎడమ వైపున ఉన్నతాసనం పైగల వ్యక్తి మతాచార్యుడై వుంటాడు. వెనుక శిష్యులు వున్నారు. కుడివైపున శబరనాయకుడు వినమ్రుడై ఉన్నతాసనం పైగల ఆచార్యునికి తన భక్తితాత్పర్యాల చూపుతున్నటున్నది. మిగతా వారందరూ అతనిని సైన్యము పరివారము కావచ్చును, అచార్యుడు శబరనాయకుని ఆశీర్వదిస్తున్నట్టు వున్నది. ఈ శబర వీరుని పోలిన వీరున బొమ్మగల శిలా ఫలకం ఆగ్నేయంలో వున్న చిరు దేవళంపై వున్నది. ఈ రెండూ మధూకేశ్వర ఆలయ శిల్పానికి భిన్నంగా వున్నాయి. చూపరులను నిలవేసేది సూర్యకిరణాలు పడుతుండగా చూస్తే సజీవం అని భ్రమింపజేసేది అమోఘం, అద్వితీయం దేశంలో మరే దేవాలయంలో

ఈ ఆలయ శిల్ప చిత్రాలు చూచి ముగ్ధులై పోయారు. అందరూ తప్పక చూడవలసి నదీ ద్వార శిల్ప, ఆ శిల్పిని పోషించినరాజుల చరిత్ర చిరస్మరణీయం.

మధుకేశ్వర ఆలయం చుట్టూ ప్రాకారం వున్నది, దానిలోపల ప్రధాన దేవాలయం. చుట్టూ అష్టదిక్పాలకుల లింగాలు, కళ్యాణ మంటపం మొదలైనవి వున్నాయి, సింహద్వారంలో ప్రవేశించగానే ఎదుట పెద్ద నంది కన్పిస్తుంది. గర్భాలయంలో ఆశ్చర్యం కలిగించే విషయాలు రెండు. మొదటిది ముఖలింగేశ్వర లింగం. ఇది సామాన్యంగా కృష్ణశిలా లింగం కాక తెల్లని శిలా చూడడానికి ఇది సామాన్యంగా కృష్ణ శిలాలింగం కాక, తెల్లని శిల చూడడానికి యిది చెట్టు మొదులు అని సందేహం కలిస్తూంది, రెండవది గర్భాలయంలో లింగానికి వెనుక వుండే పెద్ద చాన. చోళగంగు (క్రీ. శ. 1077) శాసనాలలో "మధూక వృక్షజనాధీశస్య" అని స్థల మహత్మ్యంలో సబర దైవంగాను వర్ణించడం వల్ల మధూక లింగమూర్తి ఆకారం తరుకాండంగా చూపడంలో బహుపురాతన విశ్వాసాలకు ఇది నిదర్శన మంటున్నారు. ఈ లింగానికి ముఖలింగం అని పేరున్నా ముఖం లేదు. కనుక ముఖలింగానికి పూర్వ రూపం మధూక లింగమేనని తోస్తూంది. ఇప్ప చెట్టును సంస్కృతంలో మధూక మంటారు. ఇది ఒరియా భాషలో మొహనా అయ్యింది. ఇది మొహ లింగం అయి, ముఖలింగంగా సంస్కృతీకరించబడింది. కళింగ ప్రాంతాలు మూడు. కనుక రాజులందరూ త్రికళింగేశ్వరులయ్యారు. అంటే మూడు కళింగాలు ముక్కళింగం అయిందే. ఇది సంస్కృతీకరణలో ముఖలింగంగా మారింది. దేవుడూ ముఖలింగేశ్వరుడుగా అయ్యాడు.

ప్రపంచాన అనేక దేశాల్లో ఆరాధ్య దైవాలకు ప్రతిమా రూపాలు ఊహించక పూర్వం జీవ వృక్షం ప్రతిరూపంగా వుండేది. ఏ దేశ మతపూరాణ గాథలు వెతికినా చెట్టు కన్పిస్తుంది. చెట్లు దేవతా నిలయాలను కోవడం ఆకాశం, గ్రహాలు వగైరా కూడ చెట్లుగా భావించడం బహు పురాతన విశ్వాసం.

గిరిజన సంస్కృతిలో శతాబ్దాలనుంచి ఇప్ప చెట్టుకు ఓ ప్రత్యేక స్థానం వుంది త్రికళింగాంతర్భాగమే నేటి ఒస్సా. అక్కడ అడవికుల్లో నేటికి ఇప్పచెట్టు తొర్రల్లో దేవుడు వుంటాడనీ నమ్మకం. అదిలాబాద్ జిల్లాలోఅటవికులు ఉత్సవాల తరువాత తమదైవం "సాలి"ని ఇప్పచెట్టుపై దాచి పెడతారు. గర్భాలయం వెలుపల విష్ణు మందిరం వుంది దీనిని రామానుజాచార్యులు ప్రతిష్టించారని అంటారు,

# రామప్ప దేవాలయ రమణీయ శిల్పాలు

కాకతీయుల విశిష్ట కళారాధన, ప్రజా హృదయారాధన, హనుమకొండలోని వేయి స్తంభాల గుడి, పాలంపేటలోని రామప్ప గుడులు, వరంగల్‌లోని రాజమందిర శిథిలాలు, కాకతీయుల కళాభిమానానికి తార్కాణాలు. రామప్ప చెరువు, లక్నవరం చెరువు పాకాల చెరువు, భద్రకాళి చెరువు మొదలైనవి గొప్ప జలాశయాలు వారి ప్రజారాధనకు ఉదాహరణాలు.

రామప్ప దేవాలయం వరంగల్లుకు 60 కిలో మీటర్ల దూరములో వున్న పాలంపేటకు ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలో వున్నది. ఆలయం క్రీస్తు శకం 1234 సంవత్సరంలో రేచెర్ల వంశీయుడైన రుద్రసేనానిచే నిర్మించబడినది. రుద్రసేనాని రామప్ప దేవాలయా ఆవరణమందు వేయించిన శాసనమందు, తమ దేశాన్ని ఆక్రమించ ప్రయత్నించిన నగతి భూపాలుని బహు భంగుల పరాభవించి కక్ష తీర్చుకొన్నట్లు వున్నది. కాకతీయ రుద్ర దేవుని తమ్ముడైన మహా దేవరాయలు పరిపాలించే కాలంలో చైత్ర పాలునితో సంభవించిన యుద్ధంలో మహాదేవరాయలు మరణించాడు. ఆతని కుమారుడు గణపతి దేవుడు చెరపెట్టబడినాడు. రుద్రసేనాని గణపతిదేవుని చెరనుండి విడిపించి సింహాసనాధీశుని చేసి కాకతీయ రాజ్యస్థాపనాచార్య బిరుదు పొందాడు. ఇట్టి ప్రతిభాశాలి శిల్పస్రష్టయైన రామప్పచే ఘోర అడవిలో రామప్ప దేవాలయం నిర్మింపజేసి కీర్తి పొందాడు.

రామప్ప దేవాలయం చుట్టూ బలమైన ప్రాకారం నేటికిని చెక్కుచెదరకుండా వుంది. ఆలయ ప్రవేశ ద్వారం చిన్నగా వుంది. ప్రధాన ఆలయానికి రెండు వైపుల రెండు ఆలయాలు శిథిలావస్థలో వున్నాయి. ప్రధాన ఆలయం ప్రధాన ద్వారం ఉత్తర దిశయందు వున్నది. ఈ ఆలయం భూమికి ఆరు అడుగుల నాలుగు అంగుళాల ఎత్తున వున్నది, ఈ ఆలయాన్ని ఏనుగులపై వున్న సింహాలు మోసినట్లు వున్నది ద్వారములపై వున్న నల్లరాతి సాలభంజికలు నిగనిగ లాడుతున్నవి, మంటపంనందు వున్న నాలుగు స్తంభాల శిల్పము వర్ణనాతీతం. మొదటి స్తంభంలో ఒక ప్రక్క ఏడుగురు నర్తకీమణుల విగ్రహాలు నాట్య మొనర్చుతున్నట్లు వున్నది. పదునాల్గు కాళ్ళకు బదులు, పండ్రెండు కాళ్ళు వున్నవి.

మనము ఏ కోణంనుంచి చూచినా వాటి భంగిమలు చెడలేదు. ప్రత్యేక దృష్టితో వీక్షించిన దీని ప్రత్యేకత కన్పిస్తుంది. రెండవ వైపు సముద్ర మథనము.

స్తుంది. స్తంభాలు మన మొఖలు చూచుకొనంతటి నునుపు కలిగి వున్నాయి. గర్భ గుడినందు వున్న రామలింగేశ్వరస్వామి మూడు అడుగుల ఎత్తు రెండు అడుగుల చుట్టు కొలత కలిగి వున్నది. గర్భాలయం లోపలి ద్వారము చిన్న చిన్న రంధ్రాలతో రాతి చట్రములో నగిషీ పని చూడ ముచ్చటగా వున్నది. ద్వార పాలకులు వింజామ రలు చేతబూని ఆ భంగిమలోనున్న నల్లరాతి విగ్రహములందు జీవ కళ వుట్టి పడు తున్నది, ఆలయ మధ్య భాగం నందు పైకప్పులోని నటరాజ, విష్ణువు, సముద్ర మథనం అతి సుందరంగా చెక్కబడినవి. ప్రళయకాల రుద్రుడైన ఫాలలోచుడు నల్ల రాతి విగ్రహంలో నిగ నిగ లాడు చున్నాడు.

గర్భాలయమునకు పడమర మహిషాసురమర్దనిని పోలిన విగ్రహం ఆ భంగిమలో కలదు. ఎనిమిది చేతులలో రెండు చేతులు భిన్నమైనవి. ఢమరుకండాలు, కత్తి, దీపం మిగిలిన చేతులలో కలవు. విగ్రహం రెండు ప్రక్కల ఇద్దరు రాక్షసులు వున్నారు. మొదటి రాక్షసుని క్రింద మహిషము వున్నది. రెండవ రాక్షసుని సింహం కరచినట్టు వున్నది. ఆలయం రెండవ వైపు తల భిన్నమైన స్త్రీ విగ్రహం ఒకటి వున్నది. ఈ విగ్రహముల చుట్టును చిన్న గుడులు కట్టబడినవి, వాటి ద్వారములు లోపలి విగ్రహములకన్న చిన్నవిగా వున్నవి.

రామలింగేశ్వరుని కెదురుగావున్న నంది, ఆకారమున సహస్ర మంటప దేవాలయములోని నందికన్న చిన్నదైనను సౌష్టవమున శిల్ప చాతుర్యమున దానిని మించి వున్నది. నందిపై వున్న గొలుసుల పొందిక అపూర్వం. ముఖం గంభీరముగా వున్నది. చెవులు, కాలిగిట్టలు, తోక సజీవంగా వున్నట్లు భ్రాంతి కలిగిస్తాయి.

ఆలయ ప్రవేశ ద్వారమునవున్న రెండు నాగినుల నగ్న విగ్రహాలు వంపులు తిరిగి వాస్తవికతకు దూరం కాకుండా యీ దేవాలయంతోని అన్ని శిల్పాలకన్నా మిన్నగా వున్నాయి. ఈ ఆలయం చుట్టూనూ పండ్రెండు విగ్రహాలు నాగినుల పోలినవి కలవు, ప్రశాంతత, దైవ భక్తి కలిగించే దేవాలయంలో శిల్పి ఏ వుద్దేశంతో ఈ నగ్న విగ్రహాలను సృష్టించాడో? అర్థం కాలేదు రామప్ప శిల్పి సౌందర్య పిపాసి. ఈ శిల్పి జీవితము నందువున్న చిగి, పరిపూర్ణత మొదలగు విశాల భావాలు జీర్ణించుకొని తాను రచించే నగ్న చిత్రాల భంగిమలందును. అలంకరణ విషయము నందును చైతన్యం ప్రకటింపజేసి ఆంధ్రుల శిల్పమునకు శోభను, లావణ్యాన్ని గూర్చి ఈ దేవాలయం రక్తికి ముక్తికి తగినదనిపించాడు.

రామప్ప ఆలయ నిర్మాణం చేసేకాలంలో ఒక పాముల వాని కూతురి రూప భావ విలాసాలకు ముగ్ధుడై. భక్తి ప్రవత్తులు కలిగించు చిత్రాలు చెక్కుటకు బదులు కామోద్రేకంచే నగ్న చిత్రాలు పలిష్టించి అధికారుల ఆగ్రహానికి పాత్రుడై పాముల వాని కూతురు బంధించబడగా అమరత్వం మొందినాడట. ఇది ఎంతవరకు సత్యమో తెలియదు. ఆలయం ఎర్రరాయితో నిర్మించబడినది, ఆలయం చుట్టూను ఏనుగుల వరసలు వున్నాయి. ఆలయం చుట్టూను వివిధ భంగిమలలో వున్న శృంగార చిత్రాలు దేవతల విగ్రహాలు భారత, భాగవత కథా చిత్రాలు వున్నాయి. ఆలయపు శిఖరం ఇటికలతో నిర్మించినారు. ఈ ఇటికలు ప్రత్యేకత నీటియందు వేసిన బెండ్లవలె తేలియాడటం, ఆలయం రెండు వైపుల రెండు ఆలయాలు అత్యంత శిథిలావస్థలో వున్నాయి. ఆలయ ఈశాన్య భాగమందు ధర్మసాల వున్నది. ఆ కాలమందు భోజన సామాగ్రి నిల్వ వుంచటానికి, వండుటకు వుపయోగించేవారట. ఇదికూడ శిథిలమై పోయింది.

రామప్ప ఆలయమునకు చుట్టూను నాలుగు దేవాలయములు కాల పురుషుని కాల ప్రభావమున జీర్ణమౌతున్నవి. రామప్ప దక్షిణ భాగమందున్న ఆలయం ఎర్ర రాయితో నిర్మించబడినది. వికసించినట్టి పద్మములు, చిన్న చిన్న దేవతల విగ్రహాలు రాతి చట్రములోని చిన్న చిన్న రంధ్రములు, ఆలయ కప్పులోని శిల్ప కళ అత్యుత్తంగా వున్నవి. మిగతా మూడు ఆలయాలు లతా గుల్మాదులచే చుట్టబడి. యోర వల్మీకుల ఆలవాలమై తగిన పోషణలేక కాల మహా ప్రవాహమందు జీర్ణమౌతున్నవి. నల్ల మేఘాల చాటు వేణాంకురీతి, చావు బ్రతుకుల మధ్య వేసారిపోయే శిల్పకళా సంపదను వీక్షించి ఒక భావ కవి కలం నుండి జాలువారింది ఒక కవిత.

ఏ శిల్పి హస్తంబు తెల్లోరా గుహాలలో
దివ్య విగ్రహముల దిద్దగలిగె
ఏ శిల్ప నైపుణ్య మీ యజంతా చిత్ర
కనునీయ కళలను గ్రుక్కుచుండు
ఏ కళా చాతురి ఏక శిలాపురి
గుడి కుడ్యములలోన గులుకుచుండు

రామప్ప సరస్సు పాలంపేటకు రెండు కిలో మీటర్ల దూరంలో వున్నది. ఈ సరస్సు గణపతి దేవునిచే క్రీ. శ, 1213 సంవత్సరంలో నిర్మించబడింది. ఈ సరస్సు,

అడవిలో జింకలు, దుప్పులు, ఎలుగుబంట్లు చిరుతపులులు, పెద్ద పులులు యథేచ్ఛగా విహరిస్తూ వుంటాయి. కొండలలో జోరున ప్రవహించే సెలయేళ్ళ గలగలలు, నిశీథిలో తాటి చెట్ల కల్లు తాగే భల్లూకాల గుటగుట ధ్వనులు. క్షణకాలం నివ్వెర పరిచే పక్షుల విచిత్ర కిలకిలా రావాలు, చిత్రకారుని కుంచెకు కవికలానికి పని కల్పిస్తాయి. రసిక హృదయాలను రంజింపజేసే రమణీయ ప్రదేశము.

రెండు కొండలను చీల్చి నిర్మించిన తూము క్రింది నుండి చూస్తే హృదయం గగుర్పొడుస్తుంది. దీనినే సోమికాలువ అంటారు. రామప్ప సరస్సు వల్ల సుమారు పదివేల ఎకరాలకు నీటి సదుపాయం కల్గుతుంది.

## వెలుగులవీడు కొండవీడు దుర్గం

గుంటూరు జిల్లా ఫిరంగిపురానికి సుమారు ఆరు కిలో మీటర్ల దూరాన దక్షిణ దిశగా బారులుతీరిన ఎత్తైన కొండలపైన, క్రింద ఈ దుర్గం నిర్మించబడింది. ఈ దుర్గానికి పోయే దారిలో మొదట కొండవీడు గ్రామము వున్నది. ప్రస్తుతము యీ గ్రామము సామాన్యమైన గ్రామమే ఈ గ్రామానికి రెండు కిలో మీటర్ల దూరంనుంచి కోట ప్రారంభమౌతుంది. ఈ కోట ప్రవేశ ద్వారమే చరిత్ర ప్రసిద్ధి చెందినట్టి కొండవీటి సింహద్వారము. ఈ సింహద్వారము పూర్వం 44 అంతస్థులట కొండవీటి దుర్గం 44 బురుజులతో 72 దర్వాజాలతో విలసిల్లినది. ఈ కోట కింద 18 పేటలు వుండినవని ప్రతీతి. సింహద్వారము ఎత్తు 20 అడుగులు వెడల్పు 12 అడుగులు. క్రీస్తుశకం 14వ శతాబ్దం ఆరంభంలో కాకతీయ సామ్రాజ్యం అస్తమించింది. వారి సామంతులైన ప్రోలయ వేమారెడ్డి స్వతంత్రుడై ప్రత్యేక ప్రభుత్వం స్థాపించి ఈ అభేద్యమైన గిరిదుర్గం స్థాపించాడు ప్రోలయ వేమారెడ్డి తరువాత వంద సంవత్సరాలు రెడ్డిరాజులు దీనిని పాలించారు. అప్పుడు ఇది ఎర్రన్న కవితలకు శ్రీనాథుని విద్యాధికారానికి వామనభట్టు బాణుని గీర్వాణ కవనానికి ఆలవాలమై వుండేది. 1454 సంవత్సరంలో ఉత్కళ భూపతి కోటను ముట్టడించి వశపరచుకొన్నాడు. 60 సంవత్సరాలు యీ కోట ఉత్కళ వంశంలోనే వుంది. 1515లో ఇది శ్రీకృష్ణదేవరాయల కాలంలో వశమైంది. విజయనగర సామ్రాజ్యం అస్తమించిన తరువాత దీనివైభవము అంతరించింగి, నేడు పూర్తిగా అరణ్యమై లోపలికి వెళ్ళడానికి వీలులేకుండా అయ్యింది. ఎంతో శ్రమకు ఓర్చి ధైర్యం కూడగట్టుకొని లోపలికెళ్ళాసి వచ్చింది, మన పూర్వుల దుర్గ నిర్మాణ చాతుర్యం యుద్ధతంత్రకౌశల్యం వేనోళ్ళ కొనియాడదగినది.

ముందు పేర్కొన్న సింహ ద్వారం మలుపులోనే వినాయకుని విగ్రహం అటు తరువాత కోట అంజనేయస్వామి విగ్రహం వున్నాయి. వీరిద్దరూ ద్వార పాలకాధిష్ట దేవతలట. ముఖ్యంగా చూతవల్సింది వేణుగోపాలస్వామి ఆలయం. ఇది 60 మంది రెడ్డి వీరులను ఆహూతి కొన్నట్టి బావి, దేవాలయంలో శిల్ప కళా ప్రాభవం చెక్కు చెదర లేదు. దేవాలయం వెనుక భాగంలోని గర్భ గుడినే కత్తుల బావి అంటారు. రెడ్డిరాజుల మహా మంత్రి 60 మంది రెడ్డి వీరులను కుట్రపన్ని హత మార్చాడట. ఈ బావి లోతు దాదాపు 50 అడుగులు. ఈ కత్తుల బావికి, వేణుగోపాలస్వామి ఆలయానికి దక్షిణంగా కిలో మీటరు దూరంలో నందీశ్వరుని విగ్రహం వుంది. ఇదిలో అపూర్వ శిల్ప కళా ఖండం. దీని ఎత్తు పది అడుగులు. పొడవు ఎనిమిది అడుగులు ఈ నందీశ్వరుని ముందు ప్రఖ్యాతి గాంచిన ఈశ్వర ఆలయ మొకటి. యీనాడు నామరూపాలు లేకుండ పోయింది. చారిత్రాత్మకమైన ఓరుగల్లు, హనుమకొండలలో వున్న నందీ విగ్రహాలకన్నా ఇచట వున్న నందీ మిన్న అనడంలో అతిశయోక్తి లేదు ఈ దేవాలయం ముందున్న 30 అడుగుల నిడివిగల శిలా శాసనం శ్రీ కృష్ణదేవరాయులు కోటను జయించిన తరువాత ప్రతిష్టించిన దిగ్గజయ స్తంభం అంటారు.

కొండప్ప ఎక్కే దారి ప్రయాసతో కూడుకొన్నది. దాదాపు ఆరు. ఏడు వందల అడుగుల ఎత్తుగల కొండ శిఖరాలకు అంటి పెట్టుకొని కట్టిన కోట గోడలు బురుజులు ఇప్పటికీ చెక్కు చెదరకుండ గట్టిగా వున్నాయి. ఇచ్చట అనేక శిథిల గృహాల గుర్తు లున్నాయి. పది లేక ఇరభై అడుగుల కొక రోలు చొప్పున యీ ప్రాంతం అంతా రోళ్ళతో నిండి వున్నది. ఆపైన కొండపై నేతి కొట్టు, రత్నాల కొట్టు కట్టడాలు వున్నాయి. తూర్పు దిశగా కొండపైకి దారివలనే కొండవీడు గ్రామానికి దిగిపోయే దారికూడ సులువైన చక్కని దారి వున్నది. లెక్కలేనన్ని గుహలు, నీటి చెలమలు వున్నాయి.

ఇప్పటికీ మహారాణుల రత్న ఖచితమైన సువర్ణ పల్లకి ధన, కనక వస్తువులు మరుగు పడ్డాయని బైరాగులు గుప్త నిధులకోసం గాలిస్తున్నారు.



# ఫణిగిరి శిల్ప కళా క్షేత్రం

"పంచదార్ల" హరి హర రూపాలతో నిత్య నూతనంగా వెల్లివిరుస్తున్న అతి పురాతన క్షేత్రం.

పంచధారలుగా ప్రవహిస్తున్న ప్రకృతి జలం. అపురూపమైన కోటి లింగాలు మండప స్తంభాలపై మలచిన అమూల్య శిల్ప సంపద, పూర్వ చరిత్రను చాటే శిలా శాసనాలు, వీటితో చరిత్రకు అందకుండా ఫణిగిరిని ఆనుకొని భాసిల్లుతున్నది. యీ పవిత్ర క్షేత్రం. ఈ క్షేత్రం విశాఖ జిల్లా యలమంచి తాలూకాలోనిది. అనకాపల్లి-అచ్యుతాపురం రహదారిలో వున్నది. దీనినే పంచదార్ల క్షేత్రం అంటారు. ఈ క్షేత్రంలో ప్రప్రథమంగా దర్శన మయ్యేది మాధవస్వామి ఆలయం. భూతలంపై ఎత్తైన నలుచదర శిలావాటికను నిర్మించారు. అందులో ఈ దేవాలయాన్ని రూపొందించారు ఆలయం ముందు భాగంలో ధ్వజ స్తంభం. దానిముందు స్నాన వాటికలు వున్నాయి. ఇచటనే పంచధార్లలో (అంటే అయిదు ధారలుగా) తియ్యని జలం అవిరామంగా ప్రవహిస్తూ వుంటుంది.

అపురూపమైన కోటి లింగము భూమిపై పాతబడిన ఓ పెద్ద శివలింగం కన్పిస్తుంది. దీనిపై చుట్టూ అనేక వరుసలలో కోటి లింగాలు చెక్కారు. మాధవస్వామి ఆలయవామ భాగంలో కొంత దూరంలో కాశీ విశ్వనాథ ఆలయం వుంది. సగం రాతితోనూ, పైభాగం యిటుకలతోనూ నిర్మించబడినది. గర్భ గుడిలోని కాశీ విశ్వనాథుని లింగానికి సాధువులు నిత్య దీపారాధన చేస్తూ వుంటారు. ఆలయం చుట్టూ కొన్ని శిథిల శిల్పాలు పార్వతి, నంది, ఆదిశక్తి విగ్రహాలు వున్నాయి,

ధర్మ లింగేశ్వర ఆలయాన్ని పాండవులు అజ్ఞాతవాసం చేస్తున్న రోజులలో భీమునిచే బకాసుర సంహారం జరిగింది. వెంటనే వారు ఫణిగిరి ప్రాంతాలకు తరలి వచ్చేసారు. ఇచ్చట పాప పరిహారార్థం ధర్మరాజు సోదరులతోనూ, పాంచాలితోనూ కలిసి ఒక యాగం జరిపాడు. ఆ సమయంలో అతను ఒక లింగాన్ని ప్రతిష్ఠించాడని అందుచేత యీ దేవునికి ధర్మలింగేశ్వరస్వామి అని పేరు వచ్చిందని ఇచ్చట ఒక గాథ. మాధవస్వామి, ధర్మలింగేశ్వరస్వామి ఆలయాల మంటపాలు సుందర శిల్పాలతో చెక్కబడి వున్నాయి. ఇవి కొండ శిలతోనూ. సున్నితమైన పనితనంతోనూ. కడు రమ్యంగా మలచబడినాయి. కొన్ని మాత్రం ప్రత్యేక శ్రద్ధతో చెక్కినట్లు కన్పిస్తున్నాయి. క్రింద పలు చదరమైన పీఠిక, తదుపరి సింహ రూపం, దాని పై భాగం

మైన భేదముంది. ధర్మలింగేశ్వర ఆలయపు గర్భ గుడిలోని స్తంభాలు నల్ల రాతితో నిర్మించబడి, చిత్ర విచిత్ర శిల్పంతో అలంకరించబడి వున్నాయి. సింహాచలంలోని స్తంభాలపై విలసిల్లిన శిల్పానికి కొద్దిగా పోలికలు కనిపిస్తాయి. ఈ స్తంభాలపై వున్న గుర్తులు చాళుక్య రాజుల చిహ్నాలని తెలుస్తూంది.

ఇవి కాకుండా యీ క్షేత్రానికి పేరు తెచ్చినవి శిలా శాసనాలు. మండపాలలో కొన్ని స్తంభాలు నున్నటి రాతితో చెక్కబడి, పురాతన లిపిలో వున్న కొన్ని శాసనాలతో కనిపిస్తాయి. క్రీస్తు శకం 1407-1428 సంవత్సరాల మధ్య కాలంలోని తూర్పు చాళుక్య రాజుల వంశ చరిత్రలోని ముఖ్య ఘట్టాలు యీ శాసనాలతో వర్ణించబడినట్లు తెలుస్తూంది.

ప్రతి దినం ధర్మలింగేశ్వరస్వామి ఆలయంలో ఓ వింత సంఘటన జరుగుతూ వుంటుంది. ఆలయ గర్భ గుడిలో దేవుడుకి ఎదురుగా ఒక మూల చిన్న గదిలో పాము పుట్ట ఒకటుంది. అందులో శ్వేత నాగు నివసిస్తూంది. తెల్లవారుజామున పుట్టలోనుంచి శివ లింగం వద్దకుపోయి చుట్టూ ప్రదిక్షణ చేసి మళ్లీ పుట్టలోకి వెళ్ళిపోతుంది. ఇచ్చటి అర్చకులకు చాలా సార్లు యీ విధంగా కనిపించిందట. అది ఎవరికీ యే మాత్రం హాని కలుగజేయలేదని అర్చకులు అన్నారు.

ఫణిగిరి క్షేత్రంలో వున్న మూడు దేవాలయాలలోను కాశీ విశ్వనాథుని ఆలయం చాలా పురాతనమైయింది. శిథిలావస్థలో కనిపిస్తూంది. మాధవస్వామి. ధర్మలింగేశ్వరస్వామి ఆలయాలు తూర్పు చాళుక్యుల కాలంలో నిర్మింపబడినట్లు స్తంభాలపై వున్న వారి వంశ చిహ్నాలను శిలా శాసనాలనుబట్టి కొంతవరకు ఊహించవచ్చును, తరువాత విజయనగర రాజుల పోషణలో ఈ క్షేత్రం బాగా రాణించినట్లు తెలుస్తూంది, వారి సంస్కృతిని చరిత్రను చాటె సంబంధిత క్షేత్రాలు నేడు ప్రగతి పథంలో నున్న మానవకోటికి నిత్యారాధనీయమైనవి.

శుభం.



# రచయిత గురించి

లలిత కళలు, సాహిత్యంపట్ల అభిరుచి ఇంకా నేర్చుకోవాలనే తపన వుంది. 1958 సం॥ లో మొట్ట మొదటిసారి "ఎడారిలో పుష్పాలు" నాటకం వ్రాసాను. నాటినుండి నేటివరకు 25 నాటకాలు 20 నాటికలు 15 రేడియో నాటికలు 10 కథలు వ్రాశాను. 1975 సం॥లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమిలో సభ్యుడిగా వున్నాను. 1976 సం॥ లో హైదరాబాద్ రవీంద్ర భారతిలో జరిగిన రాష్ట్రస్థాయి ఏక-పాత్రాభినయ పోటీల్లో "రాణాప్రతాప్" ఏక పాత్రాభినయానికి మొదటి బహుమతి పొందాను. శ్రీ వెంకటేశ్వర కళా పరిషత్ తిరుపతి, శ్రీ రాఘవ కళాపరిషత్ బళ్ళారి, "నెఫ్జా" కళా పరిషత్ నెల్లూరు, శ్రీ లలిత కళా పరిషత్ అనంతపురంలో కీర్తి శేషులు, పునర్జన్మ, అప్పు, వెంకన్న కాపురం నాటకాల్లో ఉత్తమ నటనకు బహుమతులు పొందాను.

1996 సం॥లో పది స్వచ్ఛంద సేవా సంస్థల ఆధ్వర్యమున జగద్గురు శ్రీ కరిబసవస్వామిద్వారా సమైక్యతా శిరోమణి బిరుదు ప్రదానం జరిగింది.

సత్యసాయి గానామృతం, పెన్నహోబిలం శ్రీ నృసింహస్వామి చరిత్ర సమైక్యతా సందేశం (కవితా సంపుటి) పుస్తకాలు ప్రచురించబడ్డాయి.

టి. టి. డి, దేవస్థానం ఆర్థిక సహాయంతో ఆంధ్రదేశంలో సుప్రసిద్ధ నృసింహ క్షేత్రాలు, శ్రీ శివ క్షేత్ర దర్శిని పుస్తకాలు ప్రచురింపబడ్డాయి.

సమైక్యతా శిరోమణి